వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా

# చారిత్రాత్మక రైతాంగ పోరాటం

సంకలనం




ప్రజాశక్తి బుక్‌హౌస్

ప్రజాశక్తి భవన్, అమరారెడ్డి కాలనీ, అరవిందా హైస్కూల్ వద్ద
*తాడేపల్లి - 522 501. ఫోన్ : 0866 -2577533*




ప్రచురణ సంఖ్య : 1673

ప్రతులు : 500

వెల : ₹ 50/-

ప్రతులకు




ప్రజాశక్తి బుక్‌హౌస్
27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ -2, ఫోన్ : 0866 -2577533

బ్రాంచీలు
విజయనగరం, విశాఖపట్నం, కాకినాడ, ఏలూరు, విజయవాడ,
గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, తిరుపతి, కర్నూలు, అనంతపురం
ముద్రణ
ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ
website : www.psbh.in
prajasaktipublishinghouse@gmail.com


150409

**విషయ సూచిక ...**

---

# ముందు మాట

కేంద్రంలోని నరేంద్ర మోడీ ప్రభుత్వం తీసుకువచ్చిన మూడు రైతువ్యతిరేక చట్టాలకు వ్యతిరేకంగా ఢిల్లీలో దేశ రైతాంగం చారిత్రాత్మక పోరాటం నిర్వహిస్తోంది. పంజాబ్, హర్యానా, యుపి, మధ్య ప్రదేశ్, రాజస్థాన్, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్ ఇంకా దేశంలోని అనేక ప్రాంతాల నుండి లక్షల సంఖ్యలో తరలివచ్చిన రైతులు రెండు మాసాలకు పైగా పట్టువదలని దీక్షతో శాంతియుతంగా ఆందోళనచేస్తున్నారు. భారత దేశ వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్లకు అంకితం చేయడానికి మోడీ ప్రభుత్వం అన్ని రకాల పార్లమెంటరీ సంప్రదాయాలనూ విడిచిపెట్టి తీసుకువచ్చిన మూడు నల్ల చట్టాలను రద్దు చేయాలంటూ రైతాంగం నినదిస్తున్నది. ఈ చట్టాలు రైతులపాలిటి మరణ శాసనాలు. అందుకే ఢిల్లీ నుండి పల్లె వరకు దేశంలోని రైతులంతా ముక్త కంఠంతో వీటిని వ్యతిరేకిస్తున్నారు. తాము పండించిన పంటకు గిట్టుబాటు ధరను గ్యారంటీ చేయాలని కోరుతున్నారు. రైతు వ్యతిరేక విద్యుత్ చట్టాన్ని ఉపసంహరించుకోవాలని కోరుతున్నారు. ఈ చట్టాల వెనుకనున్న దుర్మార్గపు ఆలోచనలను గురించీ, వాటి వల్ల ప్రజల ఆహారభద్రతకు రాబోయే ముప్పును గురించి రైతులు, వారి పక్షాన నిలబడ్డ మేధావులు ప్రజలకు వివరిస్తుంటే మరోవైపు కార్పొరేట్ మీడియా రైతు ఉద్యమంపై నిరంతరం దుష్ప్రచారాన్ని సాగిస్తున్నది. ఈ సందర్భంగా రైతు పోరాటం గురించీ, వానికి అనుకూలంగా, వ్యతిరేకంగా మోహరించిన శక్తుల గురించీ రైతులను ఈ పోరాటానికి పురిగొల్పిన పరిస్థితుల గురించీ ఫ్రంట్‌లైన్ పత్రికలో వచ్చిన వ్యాసాలను సరళతరంగా అనువదించి పుస్తక రూపంలో మీ ముందుకు తెస్తున్నాం. ఉద్యమంపైనా, భారత దేశ రైతులు ఎదుర్కొంటున్న సమస్యలపైనా అవగాహన పెంచేందుకు ఈ పుస్తం తోడ్పడుతుందని ఆశిస్తున్నాం.

– ప్రచురణకర్తలు

7

# ఢిల్లీ సరిహద్దుల్లో సమర శంఖారావం

- టి.కె.రాజలక్ష్మి

**వ**ణికించే చలిని ధైర్యంగా ఎదుర్కొంటూ, ప్రభుత్వం నుంచి ఎదురవుతున్న వ్యతిరేకతపై ఎదురు దాడిచేస్తూ శత్రువులా వ్యవహరిస్తున్న ప్రధాన మీడియాను లెక్క చేయకుండా... లక్షలాదిమంది రైతులు ఢిల్లీ సరిహద్దుల్లో చావో బతుకో తేల్చుకునే యుద్ధానికి సన్నద్ధమయ్యారు. రైతు వ్యతిరేక చట్టాలను రద్దు చేయాల్సిందేనని ముక్త కంఠంతో నినదిస్తున్నారు.

ఢిల్లీ సరిహద్దుల్లో కర్షకులు సరికొత్త చరిత్రను లిఖిస్తున్నారు. 1990 తరువాత నయా ఉదారవాద విధానాలకు ఈ స్థాయి ప్రతిఘటన ఇన్ని రోజులపాటు రావడం దేశంలో ఇదే తొలిసారి. ఈ ఉద్యమ ప్రత్యేకత ఏమిటంటే ఢిల్లీలో ఉష్ణోగ్రతలు రోజురోజుకూ తగ్గుతూ, గడ్డకట్టించే మంచుకురుస్తున్నా లక్షలాదిమంది రైతుల్లో ఉత్సాహం, పట్టుదల ఏమాత్రం తగ్గలేదు.

వినాశకరమైన మూడు వ్యవసాయ చట్టాలను వెనక్కు తీసుకోవాలనే ప్రధాన డిమాండ్ సాధించాలనే కృతనిశ్చయంతో అన్నదాతలు ఉన్నారు. ఫార్మర్స్ ప్రొడ్యూస్ ట్రేడ్ అండ్ కామర్స్ (ప్రొమోషన్ అండ్ ఫెసిలిటేషన్) చట్టం, ది ఫార్మర్స్ (ఎంపవర్‌మెంట్ అండ్ ప్రొటెక్షన్) అగ్రిమెంట్ ఆన్ ప్రైస్ అష్యూరెన్స్ అండ్ ఫార్మ్ సర్వీసెస్ చట్టం, నిత్యావసర వస్తువుల సవరణ చట్టం, 2020 విద్యుత్ బిల్లులను రైతులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఈ వ్యతిరేకతకు స్పష్టమైన, సహేతుకమైన కారణాలున్నాయి.

నవంబరు 25న పంజాబ్ నుంచి భారతీయ కిసాన్ యూనియన్ (బికెయు) ఆధ్వర్యాన మార్చ్ ప్రారంభమైంది. హర్యానా మీదుగా వాటర్ కెనాన్లు, ట్రెంచ్‌లు, టియర్ గ్యాస్ షెల్స్‌ను ధైర్యంగా ఎదుర్కొంటూ వారి మార్చ్ ఢిల్లీ సరిహద్దుల వరకూ కొనసాగింది. ఈ మార్చ్ ప్రారంభమైన నాటి పరిమాణంతో పోలిస్తే రోజురోజుకూ

పెరుగుతోంది. ప్రతిరోజూ ఎక్కువమంది వచ్చి చేరుతుండటంతో రైతుల ఉద్యమం రోజురోజుకూ ఉధృతమవుతోంది. బికెయుతోపాటు ఆల్ ఇండియా కిసాన్ సభ (ఎఐకెఎస్), స్వరాజ్ ఇండియా, ఇతర రైతు సంఘాలు ఈ ఉద్యమంలో భాగస్వాములవుతున్నాయి. ఈ సంస్థలన్నీ ఆల్ ఇండియా కిసాన్ సంఘర్ష్ కో-ఆర్డినేషన్ కమిటీలో భాగం, ఇది అనేక వందల రైతు సంఘాల విస్తృత ఫ్రంట్.

## దేశవ్యాప్త ఆందోళన

లక్షలాదిమంది రైతులు తమ ట్రాక్టర్లు, ట్రాలీలు, ఎడ్ల బళ్లపై ఢిల్లీ సరిహద్దుల్లోకి ప్రవేశించే నాలుగు ప్రధాన మార్గాల వద్ద టెంట్లు వేసుకున్నారు. వీరికి దేశంలోని ఇతర ప్రాంతాల నుంచి విస్తృత మద్దతు లభిస్తోంది. అంతర్జాతీయంగానూ వారికి సంఘీభావం లభిస్తోంది. కెనడా, బ్రిటీష్ పార్లమెంట్‌లో ప్రతిధ్వనిస్తూ అంతర్జాతీయ సంఘీభావాన్ని పొందుతోంది. అమెరికన్ కాంగ్రెస్ సభ్యులు ఏడుగురు (6 డెమోక్రాట్లు, 1 రిపబ్లికన్) ఈ పోరాటంపై భారత్‌తో మాట్లాడాలని ఆ దేశ విదేశాంగ మంత్రికి లేఖ రాశారు. ఈ ఘటనలు అంతర్జాతీయ సమాజం దృష్టిని ఆకర్షిస్తున్నాయి. డిసెంబరు 11న తమిళనాడు రైతులు కూడా ఆందోళనలో చేరారు. అనంతరం మహారాష్ట్ర నుంచి భారీ ర్యాలీగా డిసెంబరు 25న ఈ ప్రవాహంలో కలిశారు.

పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌కు చెందిన రైతు నేత మహేంద్రసింగ్ టికాయత్ 1988లో చేపట్టిన ఢిల్లీ బోటు క్లబ్ ఆందోళనతో ప్రస్తుత రైతు ఉద్యమాన్ని చాలామంది పోలుస్తున్నారు. ఆ ఆందోళన పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌కే పరిమితమైంది. తాజా ఉద్యమంలో ఒకే ఛత్రం కిందకు చేరిన రైతు సంఘాల సంయుక్త కిసాన్ మోర్చా ప్రస్తుత సమీకరణ చాలా పెద్దది. ఇటీవలి సంవత్సరాల్లో ఏ రైతు ఉద్యమం కంటే గొప్ప పాన్ - ఇండియా పాత్ర ఉంది.

హర్యానాలో బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వం పంజాబ్ నుంచి వస్తున్న రైతులను నిలువరించేందుకు తీవ్రంగా ప్రయత్నించింది. ట్రాక్టర్లు వెళ్లకుండా ఆపేందుకు లోతైన కందకాలు తవ్వించింది. రైతులు వాటిలో మట్టిని నింపేసి ముందుకు కదిలారు. వాటర్ కెనాన్లు, టియర్ గ్యాస్ షెల్స్‌తో రైతులపై పోలీసులు దాడి చేశారు. దీంతో పలువురు రైతులు గాయాల పాలయ్యారు. ఈ దృశ్యాలు దేశాన్ని దిగ్భ్రాంతికి గురిచేశాయి.

ఇటువంటి అడ్డంకులను ఎదుర్కొంటూ ఢిల్లీకి మార్చ్ వస్తుందని స్పష్టం కావడంతో పాదయాత్రను ఆపివేసి, బురారీలోని బహిరంగ మైదానానికి రైతులంతా చేరుకుంటేనే చర్చలు జరుపుతామని కేంద్రం రాయబారం పంపించింది. రైతులు ఈ ప్రతిపాదనను తిరస్కరించారు. ఈ మైదానం బహిరంగ జైలు వంటిదని పేర్కొన్నారు.



రైతులను ఉంచడానికి స్టేడియాలను తెరవాలని ఢిల్లీ ప్రభుత్వాన్ని కేంద్రం కోరింది. అందుకు ఢిల్లీ ప్రభుత్వం నిరాకరించింది. రైతులకు రాజధాని వెళ్లేందుకు ప్రజాస్వామిక హక్కు ఉందని పేర్కొంది. ఢిల్లీలో ప్రవేశించే అన్ని సరిహద్దు ప్రాంతాలనూ మూసివేసినప్పుడు ఈ చర్చ సాగింది. ఇటువంటి అడ్డంకులను ఎదుర్కొంటూ మార్చ్ ఢిల్లీ సరిహద్దులకు చేరుకుంది.

## మొక్కవోని దీక్షతో...

బిజెపి నేతృత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం అమలు చేసిన మూడు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా చేస్తున్న పోరాటానికి ఉన్న అడ్డంకులను రైతులు గుర్తించారు. తీవ్రమైన చలి వాతావరణం, కేంద్రం ఉదాసీనత, శక్తివంతమైన పోలీసు యంత్రాంగం, శత్రువుల్లా చూస్తున్న ప్రధాన స్రవంతి మీడియా ఉందని గుర్తించారు. హింసాత్మక, దేశవ్యతిరేక, మొండి పట్టుదల గల, రాజకీయంగా ప్రేరేపించబడిన వారిగా ప్రధాన స్రవంతి మీడియా రైతుల గురించి విస్తృతంగా అబద్ధపు ప్రచారాన్ని సాగించింది. వివిధ రాజకీయ పార్టీల ప్రతినిధులు ఈ చట్టాల ప్రమాదాన్ని గుర్తించి రైతులకు మద్దతు ఇచ్చినప్పటికీ కేంద్రం, పాలకపక్ష పెద్దలు తమపై చేస్తున్న తప్పుడు ప్రచారాన్ని తిప్పికొట్టేందుకు ఉద్దేశపూర్వకంగానే నిరసనలకు దూరంగా ఉన్నారు.

పెద్ద ప్రైవేటు వ్యాపారులు, కార్పొరేట్ల ప్రయోజనాల కోసం వారు పెద్దఎత్తున ప్రవేశించేందుకు మార్గం సుగమం చేయడమే లక్ష్యంగా తీసుకొచ్చిన కొత్త వ్యవసాయ చట్టాలు ప్రస్తుతం ఉన్న సేకరణ విధానాన్ని, కనీస మద్దతు ధర (ఎంఎస్‌పి) కల్పించే

వ్యవస్థను కూల్చివేస్తాయని రైతులు ఆందోళన చెందుతున్నారు.

హర్యానాలోని పానిపట్ వద్ద అదానీ గ్రూప్ (అదానీ ఆగ్రో లాజిస్టిక్స్ ప్రైవేట్ లిమిటెడ్)కు ఒక గిడ్డంగి ఏర్పాటు చేసేందుకు (వ్యవసాయ ఉత్పత్తుల కోసం) భూ వినియోగ మార్పునకు (చేంజ్ ఆఫ్ లేండ్ యూజింగ్ -సిఎల్‌యు)కు మే 7న అక్కడి టౌన్ అండ్ కంట్రీ ప్లానింగ్ డైరెక్టరేట్ అనుమతించారు. వ్యవసాయ చట్టాలు అమలులోకి రాకముందే... దేశం మొత్తం లాక్‌డౌన్‌లో ఉన్నప్పుడు ఈ అనుమతి లభించింది. పానిపట్ జిల్లా ఇస్రానా తహసీల్‌లోని నల్హా, జోంధ కలాన్ రెవెన్యూ ఎస్టేట్ గ్రామాల్లో ప్రభుత్వం మొత్తం 90,015.623 చదరపు మీటర్ల భూమిని కేటాయించినట్లు సిఎల్‌యు పత్రం ఫ్రంట్‌లైన్‌కు లభించింది.

ఎఐకెఎస్ (హర్యానా) వైస్ ప్రెసిడెంట్ ఇందర్‌జిత్ సింగ్ ఫ్రంట్‌లైన్‌తో మాట్లాడుతూ, రాష్ట్ర ప్రభుత్వం ఆహార ధాన్యాలను సేకరించనప్పుడు కనీస మద్దతు ధర లభించదని చెప్పారు. ఇది ఆహార సరఫరా వరుస క్రమాన్ని కూడా దెబ్బతీస్తుందని అన్నారు. "కనీస మద్దతు ధర ఖరీఫ్‌లో సేకరణతోపాటు ఆ తరువాత కొనసాగిస్తామని ప్రభుత్వం చెబుతోంది. కనీస మద్దతు ధరను రద్దు చేస్తున్నట్లు ప్రభుత్వం అధికారికంగా ప్రకటించదు. కానీ, వ్యవసాయ మార్కెట్ కమిటీలు (ఎపిఎంసిలు) మూతపడిన తరువాత ప్రయివేటు మాండీలకే అమ్మవలసివస్తుంది. రాష్ట్ర సేకరణ ఆగిపోయిన తర్వాత, ఎంఎస్‌పి కూడా ఉండదు. ప్రైవేటు మండీల రేట్లను నియంత్రించే రాజకీయ సంకల్పం కూడా రాష్ట్రానికి ఉండదు. ఇది ఒక ప్రైవేట్ ఎయిర్‌లైన్స్ లేదా ఒక ప్రైవేట్ ఆసుపత్రిని వారి రేట్లు తగ్గించాలని ప్రభుత్వం కోరడం లాంటిది." అని చెప్పారు. డిసెంబర్ 9 నాటి ప్రభుత్వ ప్రతిపాదనలను రైతులు ఎందుకు తిరస్కరించారో ఆయన వివరించారు. "డిసెంబర్ 9న ప్రభుత్వ ప్రతిపాదనలలో కొత్తగా ఏమీ లేదు. వాస్తవానికి, ఈ చర్య నిరసనకారులను మాత్రమే కాకుండా దేశంలోని మొత్తం రైతులను మరింత ఆగ్రహానికి గురిచేసింది. అందుకే నిరసనలు మరింతగా పెరిగాయి."

కార్పొరేట్ రంగం ఇప్పటికే వ్యవసాయంలో పాతుకుపోయిందని ఆయన అన్నారు. 'అత్యంత రైతు వ్యతిరేక ప్రభుత్వాన్ని ఆరేళ్లుగా నరేంద్ర మోడీ హయాంలో మనం చూస్తున్నాం. వ్యవసాయ రంగంలోకి ఎటువంటి హద్దూ అదుపు లేకుండా కార్పొరేట్లు స్వేచ్ఛగా ప్రవేశించేందుకు, వారు గుత్తాధిపత్యం నెలకొల్పే అవకాశం కల్పించేందుకే ఈ వివాదాస్పద చట్టాలు చేశారు.'

## నిరసనల ఉధృతి

ఢిల్లీ-హర్యానా సరిహద్దుల్లోని సింగు, టిక్రీ, ఢిల్లీ-ఉత్తర ప్రదేశ్ సరిహద్దుల్లోని ఘాజిపూర్ ప్రాంతాల్లో ముట్టడించిన రైతులతో మాట్లాడి, వారి మనోభావాలను

ఫ్రంట్‌లైన్ తెలుసుకొంది. ఢిల్లీలో అడుగుపెట్టే ఈ మూడు ప్రధాన ఎంట్రీ పాయింట్లను సాయుధ పోలీసు సిబ్బంది భారీ బారికేడ్లతో దిగ్బంధించారు. టిక్రీ వంటి ప్రదేశాలలో వారు భారీ సిమెంట్ బ్లాక్స్, క్రేన్లను ఉపయోగించారు.

పార్లమెంటు ఉభయ సభల్లో బిల్లులను ప్రభుత్వం ఆమోదించగలిగినప్పటికీ, అది జరిగిన విధానం, ప్రత్యేకించి ఓటింగ్‌ను డిమాండ్ చేసిన ప్రతిపక్షానికి చెందిన రాజ్యసభ సభ్యులను సస్పెండ్ చేయడం తదితర ఘటనలు అనేక ప్రశ్నలు లేవనెత్తాయి. ఏదేమైనా, జూన్‌లో ఆర్డినెన్సులు ప్రకటించినప్పటి నుండి రైతులు ఈ చట్టాలపై తమ అసమ్మతిని వ్యక్తం చేస్తూనే ఉన్నారు.

ప్రధానంగా పంజాబ్‌లో జులై, ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో నిరసనలు కొనసాగుతూనే ఉన్నాయి. వ్యవసాయ చట్టాలు ఆమోదించబడిన తరువాత నిరసనలు ఉద్యమరూపాన్ని దాల్చాయి. అక్టోబర్‌లో, పంజాబ్‌కు చెందిన ప్రధాన రైతు సంస్థలతో ప్రభుత్వం మొదటి సమావేశం నిర్వహించింది. ఫలితం సంతృప్తికరంగా లేదు. తదుపరి సమావేశం నవంబర్ 13న జరిగింది, ఇది మళ్లీ అస్పష్టంగా ఉంది. పంజాబ్, హర్యానాలో నిరసనలు ప్రారంభమైనప్పటికీ, అవి కొద్దిరోజుల్లోనే ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఉత్తరాఖండ్లకు విస్తరించాయి. ఇది ఉత్తర భారతదేశానికి పరిమితమైన ఆందోళన అనే ప్రచారం సరికాదని ఉద్యమ విస్తరణ నిరూపించింది.

డిసెంబర్ 8న "భారత్ బంద్" పిలుపునకు దేశవ్యాప్తంగా ఊహించనంత విస్తృత స్పందన లభించింది. అదేరోజు కేంద్ర హోంమంత్రి అమిత్ షా రైతులను చర్చకు పిలిచారు. బిజెపి పాలిత రాష్ట్రాల్లో చాలా మంది ఎఐకెఎస్ నాయకులను అరెస్టు చేశారు.

హర్యానాలోని సోనెపట్ నుంచి ఢిల్లీ వచ్చిన నిరసనకారుడు రమేష్ చికారా ఇలా అన్నారు: "హర్యానా నుంచి రైతులెవరూ ఆందోళనలో లేరని మీడియా తెలిపింది. మా రాష్ట్రంలోని కైతాల్, కురుక్షేత్ర, సోనేపట్, కర్నాల్ నుంచి వచ్చిన రైతులంతా ఇక్కడ ఉన్నారు. టీక్రీ వద్ద నిరసనలో రోహ్తక్, భివానీ, జజ్జర్ తదితర ప్రాంతాల రైతులు మీకు కనిపిస్తారు.' అని అన్నారు. "ఎంఎస్‌పి, ఎంఆర్‌పి (గరిష్ట రిటైల్ ధర) ఉన్నాయి. ఒక వ్యాపారి వద్ద ఎంఆర్‌పి ధరకు కొంటారు. మేము అడుగుతున్నది కనీస ధరకు చట్టపరమైన హామీ. మాకు ఆ చట్టాలు అర్థం కాలేదని ప్రభుత్వం చెబుతోంది. మేము వ్యవసాయ చట్టాలకు ఎందుకు వ్యతిరేకమో పార్లమెంటు సభ్యులందరికీ వివరిస్తాము."

రమేష్ చికారా తన వాదనను ఒక ఉదాహరణతో వివరించాడు: "50 గ్రాముల

బంగాళాదుంప చిప్స్‌ను వినియోగదారుడు రూ.20 చెల్లించి కొంటున్నాడు. రైతుకు కిలో బంగాళాదుంపలకు రూ .5 మాత్రమే వస్తోంది. నిలువ చేసిన వస్తువులను తనిఖీ చేయడం, మార్కెట్‌ను నియంత్రించడం ప్రభుత్వ బాధ్యత. అలా చేస్తే రైతు, వినియోగదారుడు ఇద్దరూ సహేతుకమైన రేట్లు పొందుతారు. కొత్త వ్యవసాయ చట్టాలు అమలైతే వినియోగదారులతో సహా ప్రతి ఒక్కరూ నష్టపోతారు." అన్నారు. మావోయిస్టులు, ఉగ్రవాదులు, వేర్పాటువాదులు, ఉల్ఫా మద్దతుదారులు, ఖలీస్థానీలు అంటూ ప్రభుత్వ పెద్దలు, కొందరు బిజెపి నాయకులు, మీడియాలోని ఒక సెక్షన్ తమపై దుష్ప్రచారం చేస్తోందని చెప్పారు.

సిఎఎ వ్యతిరేక నిరసనలతో సమాంతరంగా వ్యవసాయ చట్టాలపై నిరసనలు తెలుపుతున్న తమను చూపుతూ తామంతా దేశవ్యతిరేకులుగా ఒక సెక్షన్ మీడియా ముద్ర వేస్తోందని ఫ్రంట్‌లైన్‌తో మాట్లాడిన చాలామంది యువ రైతులు చెప్పారు. పాటియాలాకు చెందిన యువ రైతులు కుల్దీప్, రామన్‌దీప్ చాలా మంది రైతులు భయపడుతున్న అంశాలను వివరించారు. "మొదటి రెండు-మూడు సంవత్సరాలు మేము ప్రైవేట్ మాండిస్ నుంచి మంచి రేట్లు పొందుతాం. కానీ, అగ్రికల్చర్ ప్రొడ్యూస్ మార్కెటింగ్ కమిటీలు మూసివేసినప్పుడు, ప్రైవేటు మాండీల వారు మాకు ఆ రేట్లు ఇవ్వడం ఆగిపోతుంది. చట్టబద్ధమైన మద్దతు లేకుండా కనీస మద్దతు ధరకు ఇచ్చే హామీలు అమలుకావు' అని చెప్పారు.

పంజాబ్‌లోని గురుదాస్‌పూర్‌కు చెందిన మంజోత్ ఇలా అన్నారు: "వ్యవసాయ వ్యర్థాలు దహనం చేసినందుకు ప్రభుత్వం మాకు జరిమానా విధించినప్పుడు, కనీస మద్దతు ధర కన్నా తక్కువ ధరకు కొనుగోలు చేసేవారికి జరిమానా ఎందుకు విధించకూడదు? ఎరువులు, విత్తనాలను నిల్వ చేయడానికి మాకు సౌకర్యాలు లేవు. 100 ఎకరాల భూమిని కలిగి ఉన్న రైతు తన ఉత్పత్తులను తనకు కావలసిన చోట అమ్ముకోవచ్చు. అతను రవాణా చేయగలడు. మేము చిన్న రైతులం... మేము అలా చేయలేము." అని అన్నారు. 'బీహార్, యు.పి.లలోని రైతులు వరిని మార్కెట్‌లో నిర్ణయించిన రేటు ప్రకారం క్వింటాల్‌కు రూ.800-900కు విక్రయించారు. హర్యానా, పంజాబ్ రైతులకు కనీస మద్దతు ధర రూ.1,828 లభించింది,' అని చెప్పారు.

"మాండిస్ వద్ద మేము ఎన్నడూ కనీస మద్దతు ధర (ఎంఎస్‌పి) రేట్లను పొందలేదు. కానీ, ఉత్తర ప్రదేశ్, బీహార్‌లో రైతులకు లభిస్తున్న ధర కంటే అధికంగానే పొందుతున్నాం. ప్రైవేట్ వ్యాపారులకు స్వేచ్ఛ ఇస్తే, మేము మా ఉత్పత్తులను వారు చెప్పే ఏకపక్ష ధరలకే అమ్మవలసి ఉంటుంది. వ్యవసాయ మార్కెట్ యార్డులలో పన్నులు వసూలు చేస్తున్నారని ప్రభుత్వమే ప్రచారం చేస్తోంది. మేము చెల్లించే పన్నులను

అక్కడ రోడ్లు, వాటర్ ట్యాంకులు వంటి మౌలిక సదుపాయాలను కల్పించడానికి, మెరుగుపరచడానికి వినియోగిస్తారు" అని చెప్పారు.

లూధియానాలోని ఖన్నా తహసీల్‌కు చెందిన జాతీయస్థాయి కబడ్డీ ఆటగాడు జితేందర్ సింగ్ ఇలా అన్నాడు: "'బోలే సో నిహాల్' అని చెబితే, మేము ఖలీస్తానీలు అని వారు అంటున్నారు. శీతాకాలపు చలి మా ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేస్తుందని వారు భావించారు. గురు గోవింద్ సింగ్ వంటి మా సిక్కు అమరవీరులు చేసిన త్యాగాలను డిసెంబర్ చివరి వారంలో సిక్కులు స్మరించుకుంటారని వారికి తెలియదు. మేము చలికి అలవాటు పడ్డాం. ఆరు నెలల పాటు ఉద్యమాన్ని కొనసాగించడానికి రైతులు సంసిద్ధులై వచ్చారు. చట్టాలు రద్దు చేయకుండా మేము వెనక్కి వెళ్లేది లేదు." అని చెప్పారు. అయినప్పటికీ, చలి, అపరిశుభ్ర పరిస్థితుల కారణంగా కొంతమంది అనారోగ్యానికి గురయ్యారు.

## 'సెక్షన్ 288'

యుపి–ఢిల్లీ సరిహద్దుల్లోని ఖాజీపూర్ వద్ద "సెక్షన్ 288 ఇక్కడ విధించబడింది" అని ఒక బ్యానర్ ఉంది. దీని అర్థం ఏమిటని అడిగినప్పుడు, ఇది ప్రభుత్వం విధించిన సెక్షన్ 144 నిషేధ ఉత్తర్వులకు ప్రతిస్పందన అని పశ్చిమ యుపి నుంచి వచ్చిన రైతులు చెప్పారు. "మా నిరసన ప్రాంతంలో పోలీసుల ప్రవేశాన్ని మేము నిషేధించాము. వారి 144వ సెక్షన్‌కు రెట్టింపు 288" అని అన్నారు.

ప్రభుత్వం, మీడియాలో ఒక భాగం రైతుల నిరసనను పంజాబ్ రైతుల సమస్యగా ముద్రవేస్తున్నాయని వారు ఆవేదన వ్యక్తం చేశారు. ముజఫర్ నగర్‌లోని సిసోలీకి చెందిన బికెయు కార్యకర్త నితీష్ చౌదరి ఇలా అన్నారు: "పంజాబ్, హర్యానాలో జరిగిన నిరసనకు మద్దతుగా ముజఫర్ నగర్‌లో ఒక మహాపంచాయత్ నిర్వహించాం. ఢిల్లీకి మార్చ్ నిర్వహించాలని వారు నిర్ణయించినప్పుడు మేము వారితో కలిసి వస్తామని చెప్పాం. మమ్మల్ని ఎప్పుడూ హిందువులు, ముస్లింలుగా విభజించాలని ప్రభుత్వం కోరుకుంటోంది. వారు రైతులను ఖలిస్తానీలు అని పిలుస్తున్నారు. కానీ, అది ఇప్పుడు పనిచేయడం లేదు." అని నితీష్ చెప్పారు.

ఆయన మాట్లాడుతూ: "మేము బిజెపికి ఓటు వేయడం అతి పెద్ద తప్పు. బిజెపి తన మ్యానిఫెస్టోలో చెప్పిన దానిని ఎప్పుడూ అమలు చేయలేదు. మా ఆదాయాలు రెట్టింపవుతాయని వారు చెప్పారు. ఈ వ్యవసాయ చట్టాలతో, కార్పొరేట్లు ధరను సగానికి సగం తగ్గించి ఇస్తారు. చక్కెర మిల్లుల ద్వారా మాకు రావాల్సిన బకాయిలు గత ఒకటిన్నర సంవత్సరాలుగా పెండింగ్‌లో ఉన్నాయి. స్థానిక వ్యాపారులు బకాయిలు చెల్లించే విధంగానే చేయలేని ప్రభుత్వం పెద్దపెద్ద కార్పొరేట్ సంస్థల

నుంచి బకాయిలను, కనీస మద్దతు ధరను ఎలా చెల్లించేలా చేయగలరు? ప్రభుత్వం డిజిటల్ టెక్నాలజీని ఇష్టపడుతుంది. అప్పుడు వారు మా చెల్లింపులను ఎందుకు డిజిటల్‌గా చేయరు?" అని ప్రశ్నించారు.

"రోటిస్‌ను గూగుల్ నుంచి డౌన్‌లోడ్ చేసుకోలేము" అంటూ ఘాజిపూర్ వద్ద ఒక రైతు తీసిన వీడియో వైరల్ అయ్యింది. కొత్త వ్యవసాయ చట్టాల ప్రకారం రైతులు ఎక్కడైనా విక్రయించడానికి స్వేచ్ఛ ఉంటే, హర్యానా ఎపిఎంసి మండిస్‌లో వరి అమ్మకుండా షామ్లీ, సహారన్‌పూర్ రైతులు ఎందుకు నిరోధించారని నితీష్ చౌదరి నిలదీశారు. మూడేళ్లుగా చెరకుకు ఎంఎస్‌పి ఒకటేనని ఆయన అన్నారు. ఏ కూరగాయలకైనా ఒక రైతు అందుకున్న గరిష్ట రేటు కిలోకు రూ .10 అని ఆయన తెలిపారు.

ఉత్తరప్రదేశ్ బికెయు అధ్యక్షుడు, ప్రముఖ రైతు నేత రాకేశ్ టికాయత్ కుమారుడు గౌరవ్ టికాయత్ ఫ్రంట్‌లైన్‌తో మాట్లాడుతూ చట్టాలను రూపొందించే ముందు కేంద్రం రైతులను సంప్రదించి ఉండాల్సిందని చెప్పారు. 6 శాతం ఉత్పత్తులను మాత్రమే మాండీల వద్ద విక్రయించగా, మిగిలిన 94 శాతం ప్రైవేట్ వ్యాపారులు ఏకపక్ష ధరలకు కొనుగోలు చేశారని అన్నారు. "మండీలు బలహీనపడ్డాయి, ప్రైవేటీకరణ రైతులకు సహాయం చేయదు." అని చెప్పారు. పశ్చిమ యు.పి.లో మత విభజన జరిగిందని, రైతుల మధ్య ఐక్యతకు దెబ్బతగిలిందని యు.పి.కి చెందిన చిన్న రైతు రాజన్ జవాలా అన్నారు. రాజన్, అతని స్నేహితుడు విశాల్ బాల్యాన్ మాట్లాడుతూ చెరకుకు మద్దతు ధరను ఎప్పుడూ యుపి ప్రభుత్వం చెల్లించలేదని చెప్పారు.

కనౌజ్‌కు చెందిన దానిష్ ఖాన్ మాట్లాడుతూ, రైతులు తమ ఉత్పత్తులను ఎక్కడైనా విక్రయించుకోవచ్చునని ప్రభుత్వం చెబుతోందని అన్నారు. ఇక్కడి నుంచి తమిళనాడులో విక్రయించేందుకు రవాణా ఖర్చులను భరించేందుకు ప్రభుత్వం హామీ ఇస్తే, వ్యవసాయ చట్టాలు ఆమోదయోగ్యమైనవని అన్నారు. "40 క్వింటాళ్ల వరిని ఉత్పత్తి చేసే రైతు అమ్మేందుకు ఎక్కడికి వెళ్తాడు? ప్రభుత్వం మాకు సమాధానాలు ఇవ్వనివ్వండి. సంతృప్తి చెందితే మేము ఇంటికి తిరిగి వెళ్తాము." అని అన్నారు.

'సుగర్ ఫ్యాక్టరీలు రైతులకు బకాయిలు పెడుతున్నాయి. దీంతో, తనతోపాటు మిగిలిన రైతులు అప్పుల పాలవుతున్నారు' అని యుపిలోని హార్దోయి నుంచి వచ్చిన పర్గత్ సింగ్ చెప్పారు. లలిత్‌పూర్ జిల్లాకు చెందిన రంజిత్ యాదవ్ 50 నుంచి 60 మంది రైతులతో ఖాజీపూర్ సరిహద్దుకు వచ్చారు. ఢిల్లీ-యుపి సరిహద్దులకు చేరుకోవడం అంత సులభం కాదని, సరిహద్దుల్లో పోలీసులు అదుపులోకి తీసుకున్నారని

రంజిత్ చెప్పారు. 'లలిత్‌పూర్‌లో భారీ నీటి కొరత ఉంది. కొందరు రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. మోడీ చెప్పినట్లు మా ఆదాయాలు రెట్టింపు కాలేదు కానీ, మా ఖర్చులు మాత్రం రెట్టింపయ్యాయి." 'ఎరువులు ఖరీదై పోయాయి. బ్లాక్ మార్కెట్ నుంచి యూరియాను కొనుగోలు చేయాల్సివచ్చింది. యూరియా బ్లాక్ మార్కెటింగ్‌ను నిలిపివేసినట్లు మోడీ ప్రభుత్వం చెప్పినా, ఇక్కడ ఆ పరిస్థితి లేదు. ఎరువులు, కరెంటు, విత్తనాలు... ఇలా ప్రతి దాని కోసం ఆందోళన చెందాల్సివస్తోంది. ఏదిఏమైనా ఈ వ్యవసాయ చట్టాలపై రైతులందరినీ ఏకం చేసినందుకు మోడీకి కృతజ్ఞతలు చెప్పాలి.'

## ఇప్పుడు కాకపోతే మరెప్పుడూ కాదు

ఇప్పుడు చేయలేకపోతే మరెప్పుడూ ఈ చట్టాలను తిప్పికొట్టలేమని ఢిల్లీలోని టిక్రీ సరిహద్దుల్లో ఉన్న రైతులు అన్నారు. టిక్రి వద్ద గణనీయమైన సంఖ్యలో హర్యానా రైతులున్నారు. పంజాబ్ జిల్లాలైన మోగా, ఫిరోజ్‌పూర్, ముక్సర్ సాహిబ్, బర్నాలా, సంగ్రూర్ నుంచి కొద్దిమంది రైతులున్నారు. రాజస్థాన్‌లోని హనుమన్‌ఘర్ రైతులు కూడా వచ్చారు. నవంబర్ 26 నుంచి టిక్రీ వద్ద నిరసన తెలుపుతున్న సిర్సాకు చెందిన రైతు తార్సేమ్ సింగ్ ఇలా అన్నారు: "ఈ ఆందోళనల వల్ల రైతులకు మేలు జరుగుతుందని ఆశిస్తున్నాం. మా గ్రామాల్లో వివాహాలు ఉన్నాయి. కానీ, మేము వాటికి హాజరు కాలేము." అన్నారు.

చాలా సంస్థలు, వ్యక్తులు రైతులకు బాసటగా నిలుస్తున్నారు. అఖిల భారత ట్రక్ ఆపరేటర్ వెల్ఫేర్ అసోసియేషన్ వంటి అనేక సంస్థలు ఆహారం, మందులు మొదలైన వాటితో స్వచ్ఛంద శిబిరాలను ఏర్పాటు చేశాయి. పంజాబ్‌కు చెందిన ప్రముఖ రైతు నేత చోటూరామ్ ఆదర్శాలను అమలు చేసే జమీందార్ ఛాత్రసభ రైతులకు వంట చేసేందుకు అవసరమైన కూరగాయలను అందజేస్తోంది. స్థానిక డాక్టర్ అక్కడికి వచ్చి ఆరోగ్య అంశాలపై అవగాహన కల్పిస్తున్నారు. ఇన్‌ఫ్లూఎంజాను పోలి ఉండే లక్షణాలుంటే వెంటనే వైద్యపరీక్షలు చేయించుకోవాలని, నిరసనకారులు ఆరోగ్యంపై జాగ్రత్తగా ఉండాలని హెచ్చరిస్తున్నారు.

తమిళనాడుకు చెందిన వాలంటీర్ రవీందర్ దబాస్ మాట్లాడుతూ ఆందోళనకు హాజరైన రైతుల ట్రాక్టర్లకు 20 వేల ట్రాలీలు అమర్చి ఉన్నాయని చెప్పారు. ఇవి రహదారిపై 30 కిలోమీటర్ల పొడవు వరకు విస్తరించి ఉన్నాయన్నారు. "రైతులు దుకాణాల నుంచి ఏమీ కొనవలసిన అవసరం లేదు. ప్రతిదీ ... పాలు, కూరగాయలు, టూత్‌పేస్ట్ మొదలైనవన్నీ అందుబాటులో ఉన్నాయి. ఆరు నెలలకు సరిపోయే ఆహార ధాన్యాలు, పప్పులు అందుబాట్లో ఉన్నాయి." అన్నారు.

## రైతుల ఐక్యత

'వ్యవసాయ చట్టాలపై పంజాబ్‌లో బికెయు నిర్వహించిన 32 జాతాలు వివిధ ప్రాంతాల రైతులను ఐక్యం చేయగలిగాయి. ఈ ప్రక్రియలో పంజాబ్, హర్యానా ప్రజలు ఏకమయ్యారు. పంజాబ్ జట్, హర్యానా జాట్లు ఒకటిగా మారారు' అని టిక్రీ వద్ద రైతులు చెప్పారు. రవీందర్ దబాస్ ఇలా అన్నారు: 'సిఎఎ వ్యతిరేక నిరసనకారులతో, 'విద్యార్థులతో వ్యవహరించినట్లుగా రైతులతో వ్యవహరించవచ్చని ప్రభుత్వం ఆలోచిస్తోంది. ప్రభుత్వం వారిపట్ల వ్యవహరించిన తీరు చాలా తప్పు. రైతులపై దాడి చేసే ముందు వారు రెండుసార్లు ఆలోచిస్తారు."

ఎన్‌డిఎ ప్రభుత్వ హయాంలో రైతు సంక్షేమ పథకాలేవీ పెద్దగా అమలు కాలేదని రైతులు తెలిపారు. బికెయు (రాజేవాలా) యూనిట్ సభ్యుడు గుర్జంత్ సింగ్, రైతు బీమా పథకం ప్రారంభమయ్యే పరిస్థితేమీ లేదని అభిప్రాయపడ్డారు. "మొదట, ప్రతి ఒక్కరూ పంట విత్తారా లేదా అనే దానితో సంబంధం లేకుండా ప్రీమియం చెల్లించాలి. రెండవది, వ్యక్తిగత పరిహారాలు ఇవ్వరు. గ్రామం, వ్యక్తిగత ప్లాట్లు యూనిట్‌గా పరిగణించబడవు. ఒక గ్రామంలో మొత్తం ఉత్పత్తి నాశనమైతేనే పరిహారం ఇస్తారు. ఒక రైతు 24 గంటలు పనిచేస్తాడు. ఉద్యోగుల మాదిరిగా కాకుండా అతను తన పనికి ఓవర్ టైం పొందదు. రైతులకు ఇచ్చే పరిహారం యొక్క స్వభావం భిన్నంగా ఉండాలి."

"ఇది మేము అడగని చట్టం. ఆరోగ్యంగా ఉన్న వ్యక్తికి మందులెందుకు ఇవ్వాలి? ఇది పెద్ద సామాజిక ఉద్యమం. హర్యానా రైతులు మాకు మద్దతు ఇస్తారో లేదో మాకు మొదట్లో తెలియదు, కాని వారు అలా చేశారు. విజయోత్సవాలు జరుపుకున్న తర్వాతే మేము ఇక్కడి నుంచి ఇళ్లకు బయల్దేరేది'... ఇదే భావన దాదాపు అందరి రైతుల్లోనూ ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

**(అనువాదం: త్రిమూర్తులు)**

# వ్యవసాయ చట్టాలు : రైతుల ఆగ్రహం

– సోహం భట్టాచార్య

నరేంద్ర మోడీ నాయకత్వంలోని బిజెపి ప్రభుత్వం రైతు వ్యతిరేక చట్టాలను తీసుకొచ్చినప్పటి నుంచి...ప్రత్యేకించి పంజాబ్, హర్యానా రైతులు తీవ్ర అసహనంగా వున్నారు. దేశ వ్యాప్తంగా ఈ చట్టాలకు తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది. 400 పైగా రైతు సంఘాలు ఒకే వేదిక మీదకొచ్చి, ఆ చట్టాలను రద్దు చేయాలని డిమాండ్ చేయసాగాయి. అయితే ఆ నిరసనల కేంద్రంలో పంజాబ్, హర్యానా రైతులు ఎక్కువగా కనిపించడానికి కారణం ఏమిటి?

మూడు వ్యవసాయ చట్టాలు భారతీయ రైతాంగంలో నాలుగు రకాల భయాందోళనలను రేకెత్తించాయి. మొదటిది, ఈ చట్టాలు మండీల పాత్రను బాగా తగ్గించడం ద్వారా, వ్యవసాయ మార్కెటింగ్‌ను సరళీకృతం చేస్తాయి. తద్వారా ప్రభుత్వ సేకరణ, ఉత్పత్తుల ధరలను ప్రభావితం చేస్తాయి. రెండవది, మండీలకు బయట పన్నులు లేకుండా వ్యవసాయ ఉత్పత్తులను అమ్ముకోవచ్చన్న అంశం. ఇది ధాన్యాన్ని నిల్వ చేసుకొనే సౌకర్యం వున్న రైతులకు ప్రధానంగా ఉపయోగపడుతుంది. ఇతరులు, ముఖ్యంగా చిన్న సన్నకారు రైతులు దీనివల్ల బాగా నష్టపోతారు. మూడవది, కాంట్రాక్టు వ్యవసాయం చేపట్టిన బడా కార్పొరేట్ కొనుగోలుదారులు రైతుల బేరసారాల శక్తిని దెబ్బతీస్తారు. చివరిది – నిత్యావసర సరుకుల చట్టం రద్దు కావడంతో, వ్యవసాయ ఉత్పత్తులను భారీగా నిల్వ చేసే వారు తమ లాభాల కోసం కృత్రిమ సంక్షోభాలను సృష్టించే అవకాశం వుంది.

ఈ అంశాలను ప్రచారం చేయడంలో పంజాబ్, హర్యానా రైతులు చాలా చురుగ్గా వున్నారు. అందుకు కారణం ఏమై వుంటుంది? ఈ రెండు రాష్ట్రాలలోనూ వ్యవసాయ రంగంలో వారికున్న లోతైన అనుభవమే అందుకు కారణం. ఆ రాష్ట్రాలలోని

గ్రామీణ ప్రజానీకం జీవనోపాధికి ఎక్కువగా వ్యవసాయ రంగంపై ఆధారపడడం మరో కీలకాంశం. మరీ ముఖ్యంగా, ప్రధాన పంటలైన వరి, గోధుమ ద్వారా రైతులకు వచ్చే రాబడి సహేతుకంగా వుంది. ప్రభుత్వ సేకరణ కేంద్రాలలో మెరుగైన ధరలు లభించడం దీనికి కారణం. అయితే, నూతన వ్యవసాయ చట్టాల వల్ల వారు ఇదంతా కోల్పోవాల్సి వస్తుంది. ఆ రెండు రాష్ట్రాల్లోని రైతుల ఆగ్రహానికి కారణాలివే.

ఈ పోరాటాన్ని బలహీనపరిచేందుకుగాను...నిరసనలను ముఖ్యంగా పంజాబ్, హర్యానా లోని ధనిక రైతాంగం, వ్యాపారులు మాత్రమే చేస్తున్నారన్న వాదనలు ముందుకు తీసుకొచ్చారు. ఆ వాదనలకు అనుకూలంగా మూడు అబద్ధాలను కూడా ప్రచారంలో పెట్టారు.

**అబద్ధం1- మండీల వల్ల పెద్ద రైతులకు మాత్రమే ప్రయోజనం**

'వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపార వాణిజ్య (ప్రోత్సాహం, అవకాశాల కల్పన) చట్టం-2020' ప్రతిపాదించిన వారిలో అత్యధికులు 'వ్యవసాయ ఉత్పత్తి మార్కెట్ కమిటీ' (ఎపిఎంసి) లపై పలు విధాలుగా విషం కక్కారు. ఎపిఎంసి లను పెద్ద రైతులు, కమిషన్ ఏజెంట్లు స్వాధీనం చేసుకున్నారని పేర్కొనడం కూడా అందులో భాగమే. ఎపిఎంసి మండీలలో వున్న సమస్యలు శాంతకుమార్ కమిటీ సిఫార్సుల్లోనూ (2015) కనిపిస్తాయి. ఎపిఎంసి మండీలలో పెద్ద రైతులకు మంచి ధరలు లభిస్తుండగా, చిన్న సన్నకారు రైతులకవి ప్రతికూలంగా వున్నాయని ఆ నివేదిక తేల్చింది. 'దళారులుగా వున్న కమిషన్ ఏజంట్లు లాభాలనార్జించడంతో చివరికి ఆహార ధాన్యాల ధరలు పెరుగుతున్నాయి. చిన్న రైతులకు మెరుగైన ధరలు లభించాలంటే మార్కెట్లను సరళీకృతం చేయాల'ని కమిటీ సిఫారసు చేసింది. దాంతో ప్రయివేటు వ్యాపారులు అధిక ధరలకు కొనుగోలు చేసేందుకు వీలు కలుగుతుంది. అది రైతులకు సహాయ పడుతుందని కూడా భావించింది. ప్రైవేటు వ్యాపారులు (ప్రైవేటు కార్పొరేషన్లు) రైతులకు మంచి ధరలను అందిస్తాయన్న ఊహ మీద ఆధారపడి చేసినవే ఈ వాదనలన్నీ. మొత్తంమీద రైతు ఉద్యమాన్ని...పంజాబ్, హర్యానా లోని పెద్ద రైతులు, కమిషన్ ఏజంట్లు చేస్తున్న ఉద్యమంగా ముద్ర వేశారు.

కానీ, వాస్తవికతపై గీచిన వ్యంగ్య చిత్రం వంటిది ఇది. వాస్తవానికి, ఆహారధాన్యాలను సేకరించి విక్రయించే ఎపిఎంసి మండీలలో నిర్ణయించే ఎంఎస్‌పి (కనీస మద్దతు ధర) అనేది నామమాత్రపు ధరే. అక్కడ 23 పంటలకు మాత్రమే ఎంఎస్‌పి ప్రకటించినప్పటికీ కేవలం వరి, గోధుమల ధరలే అమలవుతాయి. మరీ ముఖ్యంగా ఈ రెండు పంటల సేకరణలో 65 శాతం పంజాబ్, హర్యానా రాష్ట్రాల నుంచే వస్తుంది. దేశంలో మిగిలిన రాష్ట్రాలలో ఇప్పటికే ప్రయివేటు వ్యాపారులు



ఆధిపత్యం చెలాయిస్తున్నారు. దాంతో వారికి వరి, గోధుమలకు కూడా ఎంఎస్‌పి కంటే ఎక్కువ రావడం లేదు. ఇకపోతే, గత రెండు దశాబ్దాలలో ఈ రెండు రాష్ట్రాలలో వ్యవసాయం వృద్ధి చెందడానికి ఎపిఎంసి మండీల ద్వారా వరి, గోధుమ పంటలకు మెరుగైన ధరలు లభించడం ఒక కారణం. ఈ రాష్ట్రాలలో హరిత విప్లవం వల్ల ఆహార ధాన్యాల దిగుబడి, విస్తీర్ణం పెరిగింది. హరిత విప్లవం ప్రారంభ దశాబ్దాలతో పోలిస్తే ఇప్పుడు దిగుబడి తగ్గకపోయినా పెరిగే శక్తి స్వల్పంగా వుంది. హరిత విప్లవం విజయవంతం అయ్యాక కనీస సాగు దిగుబడిని నిర్ధారించే మద్దతు ధర ఏర్పాటు, నిర్వహణలో ఎపిఎంసి మండీలు ముఖ్యమైన పాత్ర పోషించాయి. వివిధ శ్రేణులకు చెందిన రైతులకు వచ్చే ఆదాయంలో అంతరాలు వున్నప్పటికీ మండీల పాత్ర కీలకంగానే వుంది. ఏదేమైనప్పటికీ ధరల స్థిరీకరణలో కీలకమైన మండీల వల్ల పెద్ద రైతులకే కాక చిన్న సన్నకారు రైతులకు కూడా ప్రయోజనం చేకూరింది.

అయితే, మండీల ద్వారా...పంజాబ్, హర్యానా రాష్ట్రాల లోని చిన్న సన్నకారుల రైతులకు...ఇతర రాష్ట్రాలలోని చిన్న సన్నకారు రైతులకు అందుతున్న ప్రయోజనాన్ని...మార్కెట్ల సరళీకరణ కోరుకునేవారు పరిగణలోని తీసుకోవడం లేదు. భారత దేశంలోని మిగిలిన ప్రాంతాలతో పోల్చితే పంజాబ్ హర్యానా లోని చిన్న సన్నకారు రైతులు పొందుతున్న ప్రయోజనాన్ని పట్టిక వివరిస్తుంది. కొత్త వ్యవసాయ చట్టాల వల్ల వీరు ఏం కోల్పోతున్నారో మాత్రమే కాకుండా ఇతర రాష్ట్రాలలో ప్రభుత్వ మద్దతు కొరవడిన కారణంగా ఎంతవరకు కోల్పోయారో కూడా తెలియచేస్తుంది.

2012-2013లో పంజాబ్‌లో ఖరీఫ్ వరి పంట 78 శాతం అమ్మకాలు చిన్న సన్నకారు రైతుల నుండి జరగగా...హర్యానాలో 90 శాతం అమ్మకాలు చిన్న సన్నకారు రైతుల నుంచి జరిగాయి. ఎంఎస్‌పి ధర కంటే ఎక్కువకు అమ్ముడయ్యాయి. కాగా,

**2012-13లో పంజాబ్, హర్యానా రాష్ట్రాలలో చిన్నసన్నకారు రైతుల వరి, గోధుమల అమ్మకాలు**

| ఖరీఫ్ వరి | పంజాబ్ | హర్యానా | దేశవ్యాప్తంగా |
| --- | --- | --- | --- |
| సగటు ధర (రూ.కేజీకి ) | **22.4** | **17** | **11.6** |
| చిన్నరైతులు ఎంఎస్‌పి కంటే ఎక్కువకు చేసిన అమ్మకాలశాతం | 78.2 | 89.2 | 26.5 |
| మండీలలో చిన్నరైతులు చేసిన అమ్మకాల శాతం | 57 | 49.6 | 17.3 |
| రబి గోధుమ సగటు ధర (రూ.కేజీకి ) | 13.5 | 13.5 | 12.9 |
| చిన్నరైతులు ఎంఎస్‌పి కంటే ఎక్కువకు చేసిన అమ్మకాలశాతం | 74.2 | 93.9 | 39.5 |
| మండీలలో చిన్నరైతులు చేసిన అమ్మకాల శాతం | 50.4 | 64.5 | 29.5 |

మిగతా రాష్ట్రాలలో చిన్నసన్నకారు రైతుల అమ్మకాలలో పావు వంతు మాత్రమే ఎంఎస్‌పి కంటే ఎక్కువ ధరలకు అమ్ముడైంది. అన్నిటినీ మించి సగటు ధర ముఖ్యంగా వరికి...పంజాబ్, హర్యానా రైతులకు మిగతా రాష్ట్రాల కంటే ఎక్కువగా వుంది. గోధుమకు సంబంధించి ధర వ్యత్యాసం తక్కువగా వున్నప్పటికీ పంజాబ్‌లో చిన్న సన్నకారు రైతుల ముప్పావు వంతు గోధుమల అమ్మకాలు ఎంఎస్‌పి కంటే ఎక్కువకే జరిగాయి. హర్యానాలో ఇది 94 శాతంగా వుంది. దేశంలోని మిగతా రాష్ట్రాలలో 40 శాతం చిన్న సన్నకారు రైతుల అమ్మకాలు మాత్రమే ఎంఎస్‌పి కి చేరుకోగలిగాయి.

ఈ రెండు రాష్ట్రాలలో చిన్న సన్నకారు రైతులకు మెరుగైన ధరలు మండీల నుంచి నేరుగా అందుతాయి. ఇక్కడి సన్నచిన్నకారు రైతులు సగానికి పైగా పంటలను మండీలలోనే అమ్ముతారు. అయితే దేశంలోని ఇతర ప్రాంతాలలో మండీల ద్వారా అమ్మకాలు చాలా తక్కువగా జరుగుతాయి. 2012-2013లో దేశంలో ఉత్పత్తి అయిన ఖరీఫ్ వరిలో 17.3 శాతం, గోధుమలో 29.5 శాతం మాత్రమే మండీలలో అమ్ముడైంది.

మార్కెట్ సంస్కరణల గురించి మాట్లాడేవారు, మండీల వల్ల చిన్న సన్నకారు రైతులకు ప్రయోజనం వుండదని ప్రచారం చేసేవారు...మిగతా రాష్ట్రాలతో పోలిస్తే ఈ రెండు రాష్ట్రాలలోని చిన్న సన్నకారు రైతులు పొందే ప్రయోజనాన్ని పరిగణనలోకి తీసుకోలేదు. అంటే, అన్ని వర్గాల రైతులకు స్థిరమైన ఆదాయాన్ని అందించడంలో ఎంఎస్‌పి ధరలకు మండీల ద్వారా పంటల సేకరణ ముఖ్యమైన అంశం.

**అబద్ధం2 - కమిషన్ ఏజెంట్లు నిరసనలను ప్రేరేపిస్తున్నారు**

పంజాబ్ రైతుల్లో రుణ సమస్య ఎప్పటి నుంచో వుంది. వలస పాలనా కాలంలో కూడా రైతుల రుణ భారం వార్షిక ఆదాయం కంటే ఐదు రెట్లు ఎక్కువగా వుండేదని, ఎం.ఎల్. డార్లింగ్ 1925లో చేసిన ఒక అధ్యయనంలో వెల్లడించారు. ఈ ప్రాంతాలలో వ్యవసాయం కీలకమైన ఆదాయ వనరు కావడంతో హరిత విప్లవం వ్యవసాయ రుణాల ఆవశ్యకతను మరింత తీవ్రతరం చేసింది. పెరిగిపోతున్న అప్పుల మధ్య ప్రయివేటు రుణాలు పొందాలంటే కమిషన్ ఏజెంట్లు ప్రధాన వనరుగా మారారు. ప్రొ॥సుఖ్‌పాల్ సింగ్, టి.కె.ధాలీవాల్ 2000లో పంజాబ్‌లోని కమిషన్ ఏజెంట్ల వ్యవస్థపై జరిపిన అధ్యయనంలో ఒక కీలకాంశం వెల్లడించారు. రైతులు కమిషన్ ఏజెంట్లపై ఆధారపడడం అనేది కేవలం వ్యాపారి-ఉత్పత్తిదారుడి బంధాన్ని మించినదని తేలింది. అధిక వడ్డీ రేట్లు వున్నప్పటికీ సులభంగా, వేగంగా రుణం పొందేందుకు సమాజికంగా అల్లుకున్న బంధమది. ప్రస్తుత కొత్త చట్టాలు కమిషన్ ఏజెంట్లను కేవలం మధ్య దళారులుగానే చూస్తున్నాయి. ధాన్యం ధరలు పెంచడం ద్వారా లాభాలు పొందేవారిగానే చూస్తున్నాయి. దేశంలో 1991 నయా ఉదారవాద సంస్కరణలను అమలు చేయడం మొదలైనప్పటి నుంచి సంస్థాగత రుణాలు తగ్గిపోయాయి. గత రెండు దశాబ్దాలలో సాగు ఖర్చు పెరిగింది. వ్యవసాయంలో ప్రత్యక్ష రాయితీలు తగ్గాయి. దాంతో పంజాబ్, హర్యానా ప్రాంతాలలోని రైతులకు అప్పు పుట్టాలంటే కమిషన్ ఏజెంట్లే గతయ్యారు. కార్పొరేట్ కొనుగోలుదారులను ప్రవేశ పెట్టడం వల్ల మండీలపై ప్రభావం చూపించే కమిషన్ ఏజెంట్లు ఉద్వాసనకు గురవుతారు. దాంతో రైతులు, కమిషన్ ఏజెంట్ల ప్రయోజనాలు కలుస్తాయి. వడ్డీ వ్యాపారికి రైతుకు మధ్య వున్న సామాజిక పంపిణీ గొలుసులో కేవలం వడ్డీ వ్యాపారస్తుల పాత్రను మాత్రమే గుర్తించడం వల్ల...రైతులు ప్రయివేటు వడ్డీ వ్యాపారస్తుల మీద అంతగా ఎందుకు ఆధారపడతారనే అంశం బయటకు రాదు. ప్రధానంగా సంస్థాగత రుణాలు అందకుండా పోవడంతో రైతులకు అప్పుల కోసం మరో మార్గం లేకుండా పోయింది. దాంతో వడ్డీ వ్యాపారస్తులే ప్రధానమైన వనరుగా, మిత్రులుగా మారారన్న వాస్తవం ప్రస్తుతం జరుగుతున్న రైతు నిరసనల్లో ప్రతిధ్వనిస్తోంది.

**అబద్ధం3- నిరసనల్లో కార్మికులకు వాటా లేదు**

గత కొద్ది సంవత్సరాలుగా ఉపాధి పరిస్థితి మరింత దిగజారింది. భూమి లేని దళిత కార్మికులు ఎక్కువగా నష్టపోతున్నారు. పంజాబ్, హర్యానాల్లో వ్యవసాయేతర పనుల వల్ల బతకడానికి సరిపడా ఆదాయం అందడం లేదు. 2018-2019 'పీరియాడిక్ లేబర్ ఫోర్స్ సర్వే' నివేదిక ప్రకారం పంజాబ్, హర్యానాలో 93 శాతం పైగా దైనందిన కార్మికులు ఇప్పటికీ వ్యవసాయి రంగం మీదే ఆధారపడ్డారు. వీరిలో భూమి లేని కార్మికులు ఎక్కువగా వున్నారన్న విషయం ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. దినసరి వేతన కూలీలు గ్రామీణ వ్యవసాయ రంగంపై ఎక్కువగా ఆధారపడడం వల్ల రెండు రకాలుగా వారి జీవన పరిస్థితులు దిగజారాయి. మొదటిది – ఈ రెండు రాష్ట్రాలలోని పలు వ్యవసాయ పనులలో యంత్రాలను ఉపయోగించడం వల్ల ఇతర రాష్ట్రాలలో కంటే వ్యవసాయ పని దినాలు బాగా తక్కువగా వున్నాయి. దాంతో, ఎక్కువ మంది కార్మికులు హమాలీలుగా పని చేయసాగారు. రెండవది- బీహార్, ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చిన వలస కార్మికులు పలు రకాల వ్యవసాయ పనుల్లో చేరడంతో...స్థానిక దినసరి కార్మికులు దగ్గరలోని మండీలలో దొరికే కూలి పనులపైనే ఎక్కువగా ఆధారపడుతున్నారు.

పంజాబ్ లోని మాన్సా జిల్లాలోని ఒక గ్రామంలో 'ఫౌండేషన్ ఫర్ అగ్రేరియన్ స్టడీస్' ఇటీవల ఒక సర్వే చేసింది. భూమి లేని దళిత కార్మికులు 40 శాతం పైగా దగ్గరలోని మండీలలో కూలీలుగా పనిచేస్తున్నారని తేలింది. వ్యవసాయేతర పనులు లేకపోవడంతో వీరంతా ఎపిఎంసి మండీలలో పని చేస్తున్నారు. కొత్త చట్టాల వల్ల తమ జీవనాధారాన్ని కోల్పోతున్నామని తెలిసినప్పుడు పోరాటానికి దిగుతారు. ఇప్పుడు వారిదే చేస్తున్నారు.

ఎపిఎంసి మండీలలో కమిషన్ ఏజెంట్ల ప్రభావాన్ని కాదనలేం. వారు రైతాంగాన్ని అప్పుల ఊబిలోకి నెట్టేశారు. అయితే అందుకు చూపించిన పరిష్కారాలు మరింత సమస్యాత్మకంగా వున్నాయి. పైగా ఈ చట్టాలలో కార్పొరేట్ కొనుగోలుదారుల పాత్రను ఎక్కువగా నొక్కి చెప్తున్నారు. ఎంఎస్‌పి ధర గ్యారంటీ లేకుండా, మండీల బయట ఎవరు నిర్వహిస్తారో స్పష్టత లేకుండా వ్యవసాయం పరిస్థితి మరింతగా దిగజారిపోతుంది. ఏదేమైనప్పటికీ కేంద్ర ప్రభుత్వం పన్నిన నేరపూరిత వ్యూహాలు... రైతులు, కార్మికుల సంఘీభావం కారణంగా... రైతుల నిరసనల లోకి ప్రవేశించలేకపోయాయి. పంజాబ్, హర్యానా లోని రైతులు, కార్మికులు ఒకరినొకరు వ్యతిరేకించుకునే వర్గ శక్తులుగా కనిపించినా ఇప్పుడు నిరసనలతో దగ్గరయ్యారు. వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా అంతకంతకు పెరుగుతున్న ప్రతిఘటన...బడా పారిశ్రామికవేత్తలతో నరేంద్ర మోడీ ప్రభుత్వానికి వున్న సంబంధాలను బహిర్గతం చేసింది.

**(అనువాదం : కె. అంజన)**

# వ్యవసాయ కార్పొరేటీకరణే లక్ష్యంగా మోడీ చట్టాలు

- రితికా శ్రీమాలి

వ్యవసాయ రంగాన్ని సైతం కార్పొరేటీకరించడమే లక్ష్యంగా కేంద్రంలోని నరేంద్రమోడీ ప్రభుత్వం నూతన చట్టాలను రూపొందించింది. పూర్తిస్థాయిలో ఈ చట్టాలు అమలులోకి వస్తే చిన్న, మధ్య తరగతి రైతులు వ్యవసాయాన్ని అనివార్యంగా వదులుకోవాల్సివస్తుంది. ఇష్టం ఉన్నా లేకున్నా తమ భూములను ధనిక రైతులకు తెగనమ్ముకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. వ్యవసాయ రంగంలో పెట్టుబడి పోగుపడటానికి. కేంద్రీకరణకు దారి తీస్తాయి. కాంట్రాక్టు వ్యవసాయం అన్నది భారత రైతాంగానికి కొత్త పదమేమి కాదు. 1990వ దశకం నుండి ఏదో రూపంలో వింటూనే ఉన్నాం. అప్పటి నుండి భారత పాలకవర్గాలు వ్యవసాయం గిట్టుబాటు కావడం గురించి, కనీస మద్దతు ధర గురించి, రైతుల ఆదాయాన్ని రెండింతలు చేయడం గురించి మాట్లాడుతూనే ఉన్నాయి. ఆచరణలో మాత్రం గత మూడు దశాబ్దాలుగా రూపొందిస్తున్న విధానాలు, చేపడుతున్న చర్యలు వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్ పరం చేయడానికే దోహదపడ్డాయి. తాజాగా నరేంద్ర మోడీ ప్రభుత్వం రూపొందించిన మూడు చట్టాలు కూడా ఇంతే! రైతులకు లబ్ధి చేకూరుతుందని కేంద్ర ప్రభుత్వం పదేపదే చెబుతున్నప్పటికీ కార్పొరేట్లకు మాత్రమే వీటి ద్వారా ప్రయోజనం కలగనుంది. ఆ చట్టాల వల్ల చోటుచేసుకునే పరిణామాలు చూద్దామా!

**1. ది ఫార్మర్స్ ప్రొడ్యూస్ ట్రేడ్ అండ్ కామర్స్ (ప్రొమోషన్ అండ్ ఫెసిలిటేషన్ యాక్ట్ 2020**

2014-2015 ఆర్థిక సర్వే ప్రకారం దేశ వ్యాప్తంగా 2,477 వ్యవసాయ కమిటీలు ఉన్నాయి. 1954 ఎపిఎంసి చట్టం ప్రకారం లైసెన్స్ పొందిన కమిషన్ ఏజెంట్లు ఈ కమిటీలలో రైతుల నుండి వ్యవసాయ ఉత్పత్తులను కేంద్ర ప్రభుత్వం

నిర్ణయించిన కనీస మద్దతు ధరకు కొనుగోలు చేస్తారు. మార్కెట్ కమిటీలు స్థానికంగా రైతులకు అవసరమైన కనీస వసతులను ఏర్పాటు చేస్తాయి. రాష్ట్ర ప్రభుత్వాలు ఈ కమిటీల్లోగానీ లేదా ప్రత్యేకంగా మార్కెట్లు ఏర్పాటు చేసి కొనుగోలు చేయవచ్చు. ఈ తరహా చర్యలు సమర్థవంతంగా అమలు కావడంతో పంజాబ్, హర్యానా రైతులు బాగా లబ్ధి పొందారు. ఈ యార్డుల ద్వారా కచ్చితమైన స్థిర ఆదాయాన్ని వారు పొందుతున్నారు. ఒక క్వింటాలు ధాన్యంను ఉత్పత్తి చేస్తే కనీసం 1,868 రూపాయలను ధరగా పొందవచ్చన్న హామీ ఉంది. కేంద్ర ప్రభుత్వం రూపొందించిన తాజా చట్టంతో మార్కెట్ ఫీజును, లెవిని వసూలు చేసే హక్కును కమిటీలు కోల్పోతాయి. వ్యాపారం జరిగే ప్రాంతం మొత్తాన్ని జీరో టాక్స్ ఏరియాగా కేంద్రం ప్రకటించడంతో మార్కెట్ కమిటీలకు ఎటువంటి ఆదాయం రాని పరిస్థితి నెలకొంటుంది. వీటిని కొనసాగిస్తామని ప్రభుత్వం చెబుతున్నప్పటికీ ఆచరణలో అవి మూత పడకతప్పని స్థితి ఏర్పడుతుంది. దీని ప్రభావం చిన్న మధ్యతరగతి రైతులపై పడుతుంది. కమిటీలే లేనప్పుడు వీరు కనీస మద్దతు ధరను ఎక్కడి నుండి పొందుతారు? మార్కెట్ కమిటీలు ఒకసారి అంతర్ధానమైన తరువాత రైతులు కార్పొరేట్ల మీద వారి దళారుల మీద ఆధారపడి తీరాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అంతేకాదు. తాజా కేంద్ర చట్టంతో ప్రభుత్వ, ప్రైవేటు రంగానికి సమాన అవకాశాలు కల్పించే మోడల్ అగ్రికల్చరల్ ప్రొడ్యూస్ అండ్ లైవ్‌స్టాక్ మార్కెటింగ్ (ప్రమోషన్ అండ్ ఫెసిలిటేషన్) యాక్ట్ కూడా మూలనపడనుంది. దీంతో వ్యవసాయంలో ప్రభుత్వేతర రంగాల పాత్ర పెరుగుతుంది. అంతర్జాతీయంగా ధరల ఒడిదొడుకుల నుండి రైతులను రక్షిస్తూ వచ్చిన ప్రభుత్వ చర్యలు కనుమరుగవుతాయి. రైతులు నేరుగా వీటికి గురికావాల్సివస్తుంది. మార్కెటింగ్ కమిటీలు పనిచేయకపోవడంతో రాష్ట్ర గోడౌన్లు నిరుపయోగంగా మారుతాయి. దీని ప్రభావం ఆహారభద్రతపై పడుతుంది.

**2. ది ఫార్మర్స్ (ఎంపవర్‌మెంట్ అండ్ ప్రొటెక్షన్) అగ్రిమెంట్ ఆన్ ప్రైస్ అస్యూరెన్స్ అండ్ ఫార్మ్ సర్వీసు యాక్ట్ 2020**

దేశంలో ధనిక పెట్టుబడిదారి రైతులు (60 నుండి 70 అంతకన్నా ఎక్కువ ఎకరాలు కలిగిఉన్న వారు) 1960లో చోటుచేసుకున్న హరిత విప్లవం నుండి బాగా లబ్ధి పొందారు. వీరి దగ్గర పెట్టుబడులు పెట్టి భారీ లాభాల పొందడానికి అవసరమైన వనరులున్నాయి. 2000 సంవత్సరం నుండి వీరు కార్పొరేట్ తరహా వ్యవసాయమైన కాంట్రాక్టు వ్యవసాయాన్ని కూడా చేస్తున్నారు. ఈ తరహా రైతులు తమకున్న భూమిలో కొంత భాగాన్ని ఈ తరహా ప్రయోగాలకు కేటాయిస్తూ, మిగిలిన దానిలో ధాన్యం, గోధుమలవంటివి పండించుకుంటున్నారు. ఒక పారిశ్రామిక సంస్థతో ముందుగా

కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం వ్యవసాయ ఉత్పత్తుల్లో కొంత భాగం కానీ, లేదా మొత్తంకానీ విక్రయించడాన్ని కాంట్రాక్టు వ్యవసాయమని చెప్పుకోవచ్చు. ఒక పారిశ్రామిక సంస్థ తనకు కావాల్సిన ముడి సరుకును నేరుగా పొందడం ఈ విధానంలో సాధ్యమవుతుంది. (ఉదా:చిప్స్ తయారు చేసే కంపెనీ ఆలూ పండించే రైతులతో నేరుగా ఒప్పందం చేసుకోవడం) దీని ద్వారా రైతుల ఉత్పత్తులకు మంచి ధర లభిస్తుందని చెబుతున్నారు. మరో విధంగా చెప్పాలంటే వివిధ రకాల ఆర్థిక సంబంధాలు కాంట్రాక్టు వ్యవసాయం పేరిట ఒక చోట కలిసి ఉత్పత్తి ప్రక్రియలో భాగస్వామ్యం అవుతాయి. పెప్సికో, మెక్కాయిన్ ఫుడ్స్, సత్నం అగ్రిటెక్ వంటి ప్రాసెసింగ్ కంపెనీలు, సింగెంట, కార్గిల్, మాన్‌సాంటో, బిఎఎస్ఎఫ్ వంటి వ్యవసాయ ఇన్‌పుట్ కంపెనీలు, ఐసిఐసిఐ. ఎస్ బ్యాంకు వంటి బ్యాంకులు సమకూర్చే ద్రవ్య పెట్టుబడి, కాంట్రాక్టు రైతులు కలిసి వివిధ స్థాయిలో ఒప్పందాలు చేసుకోవాల్సి ఉంటుంది. ఈ ఒప్పందాల గొలుసులో అత్యంత బలహీనమైన భాగం రైతులదే! అన్ని విధాల పరిపుష్టంగా ఉండే కార్పొరేట్ సంస్థలతో సమానంగా సాధారణ రైతు వ్యవహరించలేడన్నది బహిరంగ రహస్యమే! సాధారణ రైతులకే కాదు. ఒక మోస్తరు ధనిక రైతులకు కూడా ఆ సంస్థలు పెట్టే ఆచరణకు సాధ్యం కాని షరతులు క్లిష్టంగా మారుతాయి. రైతులతో ఒప్పందాన్ని కుదుర్చుకోవడానికి ముందే కంపెనీల బోర్డు సమావేశాల్లో ఆ ఒప్పందం ద్వారా ఎంత లాభం సంపాదించాలన్నది నిర్ణయమైపోతుంది. దానికి సంబంధించిన వ్యూహం (ఒప్పందం, అమ్మకాలు. ప్రచారం, ధర) వంటివి ఖరారవుతాయి. ఆలూ సాగు చేసే రైతు కాంట్రాక్టు ఒప్పందం ద్వారా ఆ ఎంత లాభం పొందుతారో పరిశీలిద్దాం!

ఎకరానికి ఉత్పత్తి ... 15,000 కిలోలు

రైతు నుండి కొనుగోలు ధర ... కిలో రూ. 2.50

ఎకరా ఉత్పత్తి కొనుగోలుకు : 15,000 X 2.50 = రూ. 37,500

ఎకరాకు ఉత్పత్తి ధర (రూ)

విత్తనాలు ... 3,000

కార్మికులు ... 7,000 (మారవచ్చు)

ఎరువులు, పురుగుమందులు, ఇతర రసాయనాలు ... 3,000

యంత్రాలు .. 2,000

లాభం అంచనా 37,500 -15,000 ... 22,000

ముందు చేసుకున్న ఒప్పందం సంగతి ఎలా ఉన్నప్పటికీ, రైతు నుండి కొనుగోలు చేసే కీలక సమయంలో కంపెనీ అనేక అనైతిక చర్యలకు దిగుతుంది.

ఆందోళనలో వస్తున్న ఉద్యమ, రాజకీయ మార్పులను గమనిస్తున్నారు. కల్నల్‌గా పనిచేసిన దేశ్వాల్ రైతుగానూ ఎన్నో అవార్డులు పొందారు. ప్రస్తుతం రైతులు ఆందోళనల జరుగుతున్న ప్రాంతాలను ఆయన నిరంతరం పర్యవేక్షణ చేస్తున్నారు. దీనిపై దేశ్వాల్ ఫ్రంట్‌లైన్‌తో మాట్లాడుతూ రైతుల ఆందోళనను 1977 నాటి ఆందోళనతో పోల్చారు. అప్పటి ఆందోళన కేంద్రాన్ని నిలువరించగలిగిందని, ప్రధాని ఇందిరాగాంధీని మార్చేసిందని వివరించారు. ఇప్పటి ఆందోళనా అదే తరహాలో సాగుతోందని పేర్కొన్నారు.

వ్యవసాయ బిల్లులపై రైతుల్లో తీవ్ర ఆగ్రహం కనిపిస్తోందని, గత ఆరేళ్లలో మోడీ ఎదుర్కొంటున్న అతిపెద్ద సామాజిక, రాజకీయసవాలు ఇదేననీ సామాజిక, ఆర్థిక కోణంలో ఇది వచ్చిందే తప్ప రాజకీయ కోణంలో చూడటం అంత మంచిది కాదనీ లక్నోకు చెందిన ఆర్‌ఎస్‌ఎస్ కార్యకర్త ఫ్రంట్‌లైన్‌తో తెలిపారు. రైతాంగ ఆందోళన కేంద్రానికి పెద్ద సవాలుగా మారే అవకాశం ఉందని బిజెపిని నడిపిస్తున్న ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పికీ అర్థమైందనీ పేర్కొన్నారు. ఇదే విషయం రెండు నెలల తరువాత రుజువైందని వివరించారు. అదే సమయంలో సంఘ్ పరివార్‌శక్తులు, బిజెపి అనుబంధ సంస్థలు రైతాంగ ఉద్యమానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాయనీ వివరించారు.

వాస్తవంగా ప్రజలకు సంబంధించిన ఆందోళనలు మొదలైన సమయంలో సంఘ్ పరివార్ దాని అనుబంధ సంస్థలు మతోన్మాద జెండాను ముందుకు తీసుకువచ్చేవి. ఇప్పుడు అది సాధ్యం కావడం లేదు. గతంలో అనేక సందర్భాల్లో బీహార్, జార్ఖండ్ రాష్ట్రాల్లో ఆర్‌ఎస్‌ఎస్ ఈ వ్యూహాన్ని అమలు చేసింది. బీమా కోరేగావ్, ఎల్గార్ పరిషత్ దళిత ఉద్యమం, సిఎఎ వ్యతిరేక ఆందోళనలతోపాటు, జెఎన్‌యులోనూ ఆర్‌ఎస్‌ఎస్ ఈ తరహా జోక్యాలు చేసుకుంది. కన్హయ్యకుమార్‌ను కేంద్రంగా చేసుకుని జెఎన్‌యులో దేశద్రోహ ప్రచారాన్ని ముందుకు తెచ్చింది. అంతకుముందు అనేక ఆందోళనల్లోనూ జాతీయవాదాన్ని, దేశద్రోహ నినాదాన్ని ముందుకు తీసుకురావడం ద్వారా వాటిని సమర్థవంతంగా అణచేసింది. అదే పద్ధతిలో ఇప్పుడు రైతాంగ ఆందోళనను ఖలిస్తాన్ ఉద్యమంలో పోల్చారు. పంజాబ్, హర్యానాలో ఉన్న ప్రజల దేశభక్తిని ప్రశ్నించారు. ఇది రైతుల్లో మరింత ఆగ్రహాన్ని తెప్పించింది. ఈ ప్రాంతంలో ఉన్నవారిలో ఎక్కువమంది సైనికదళాల్లోనూ పనిచేస్తున్నారని, దేశ రక్షణ విషయంలోనూ తమవారు ముందున్నారని రైతులు ప్రస్తావించడంతో ఖలిస్తాన్ ప్రచారాన్ని వెనక్కు తీసుకోవాల్సి వచ్చింది. అంతేకాదు శౌర్యపతకాలు అందుకున్నవారూ వాటిని వెనక్కు ఇచ్చేస్తామని ప్రకటించడమూ ఆర్‌ఎస్‌ఎస్ కుట్రలను అడ్డుకున్నాయి.

ఈ క్రమంలో చివరకు రైతులను చర్చలకు పిలవాల్సిన పరిస్థితికి కేంద్రం వచ్చింది.

## ఉద్యమాన్ని కించపరిచే వ్యూహాలు

ఈ చర్చలు జరుగుతున్న సమయంలో బిజెపి ఆధ్వర్యంలో ఉత్తరప్రదేశ్, హర్యానాలో ప్రభుత్వాలు రైతులను కించపరిచే విధంగా నీచమైన వ్యూహాలను ముందుకు తెచ్చాయి. ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఒక నాయకుడిని దీనికి అక్కడి ప్రభుత్వాలు ఎంపిక చేశాయి. ఆ నాయకుడికి అన్ని రకాల సహాయక సహకారాలను సంఘ్‌పరివార్ శక్తులు అందించే విధంగా ప్రణాళికను రూపొందించాయి. దీనిద్వారా అతన్ని రైతు ప్రతినిధిగా మార్చేందుకు అవసరమైన చర్యలూ తీసుకున్నాయి. అతని ద్వారా ఉద్యమంలోని రైతు నాయకులను చర్చలకు పిలిచినట్లు వారు అంగీకరించినట్లు రాజీకి వచ్చినట్లు ప్రకటించాలనే ఆలోచన చేసింది. దీన్ని రైతు సంఘాలు ఏకోన్ముఖంగా వ్యతిరేకించాయి. దీంతో ఆర్ఎస్ఎస్ కుట్ర తొలిదశలోనే బయటపడింది. పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లో ఈ తరహా కుట్రలో విఫలమైన తరువాత హర్యానాలోనూ ఇదే తరహా వ్యూహాన్ని బిజెపి ప్రభుత్వం అమలు చేసందుకు ప్రయత్నించింది. కానీ, రైతుసంఘాలు, రైతుల ఉమ్మడి జోక్యంతో అది కూడా విఫలమైంది.

## దెబ్బతీసే వ్యూహంలో అమిత్‌షా విఫలం

అనంతరం కేంద్ర హోంమంత్రి అమిత్‌షా మరోక వ్యూహంతో ముందుకొచ్చారు. రైతు ప్రతినిధులను చర్చలకు ఆహ్వానించారు. వారి డిమాండ్లను పరిష్కరిస్తామనే కోణంలో హామీలనూ ఇచ్చారు. రైతుల డిమాండ్లను పరిష్కరించినట్లుగా బయటకు చెప్పేందుకు ప్రయత్నించారు. వాస్తవానికి అక్టోబర్ 13న కేంద్రంతో మొదటి రౌండ్ చర్చలు మొదలైనప్పుడు రైతుల ప్రధాన డిమాండు 'సెప్టెంబర్ 20వ తేదీన ఆమోదించిన వ్యవసాయ చట్టాలను రద్దు చేయడం'. మొత్తంగా దఫదఫాలుగా 20 గంటలపాటు జరిగిన అనంతరం రైతులు చెప్పిందేమిటి ముందుగా నూతన వ్యవసాయ చట్టాలను రద్దు చేయండి అలా కానిపక్షంలో రైతుల డిమాండ్లను పరిష్కరించామని చెప్పడంలో అర్థం లేదని రైతు ప్రతినిధులు ప్రభుత్వానికి తెలిపారు. అయితే ప్రభుత్వ అనుకూల మీడియా ఒక ప్రచారాన్ని ముందుకు తెచ్చింది. అమిత్‌షా సమావేశమయిన తరువాత రైతుల డిమాండ్లను అంగీకరించారని, రైతు సంఘాల ప్రతినిధులు ఈ విషయంలో మొండిగా వ్యవహరిస్తున్నాయని కథనాలు వండి వార్చారు. ఇందులో ముఖ్యమైనది దుష్యంత్ చౌతాలా నాయకత్వంలోని జననాయక్ జనతా పార్టీ హర్యానాలో బిజెపి ప్రభుత్వంలో కలిసి కొనసాగేందుకు అంగీకరిస్తుందనేది దాని సారాంశం. జెజెపి రైతాంగంలో బలంగా ఉన్న జాట్ వర్గానికి ఎక్కువగా ప్రాతినిధ్యం



వహిస్తోంది. వ్యవసాయ చట్టాలు ఆమోదించిన వెంటనే బిజెపికి పంజాబ్‌లో బలమైన మద్దతుదారుగా ఉన్న శిరోమణి అకాలీదళ్ మద్దతు ఉపసంహరించుకుంది. ఎన్‌డిఏ నుండి బయటకు వచ్చింది. రైతుల ఆందోళనలు తీవ్రరూపం దాల్చడంతో బిజెపిలో ఉన్న ఇతర పార్టీలపైనా ఒత్తిడి పెరిగింది. దీనిబాటలోనే జెజెపి మద్దతు ఉపసంహరించుకుంది. ఒక సందర్భంలో అయితే జెజెపి ఎమ్మెల్యేలు హర్యానాలో ప్రభుత్వం నుండి విడిపోయి కాంగ్రెస్‌తో కలిసి ప్రభుత్వం ఏర్పాటు చేయాలనే అంశంపై చర్చకూడా పెట్టారు.

బిజెపి అనుకూల మీడియా మరికొన్ని కథనాలను వండి వార్చాయి. హర్యానాలో బిజెపి నేతృత్వంలో ప్రభుత్వాన్ని కూల్చేందుకు వామపక్షాలకు చెందిన కొన్ని రైతు సంఘాలు చేస్తున్న కుట్రగా దీన్ని ప్రచారం చేశాయి. ఉత్తరప్రదేశ్, హర్యానా ప్రభుత్వాలు దీన్ని ఎక్కువగా ముందుకు తీసుకొచ్చాయి. ఈ విషయాన్ని ఇంటిలిజెన్స్ సంస్థలు తెలిపాయని మీడియా సంస్థలు వండి వార్చాయి. చెప్పిన ఇంటిలిజెన్స్ సంస్థలు ఏమిటనేది ఎవరికీ తెలియదు.

## బిజెపిపై ఒత్తిడి

ఏది ఏమైనప్పటికీ ఆందోళన మొదలైన తరువాత హర్యానా రైతులు ఎక్కువమంది ఆందోళనలోకి వచ్చారు. అమిత్‌షాతో రైతుల సమావేశం అనంతరం వారి ప్రాతినిధ్యం మరింత పెరిగింది. ఇదే సమయంలో హర్యానాలో రైతులకంటే దుష్యంత్ చౌతాలాకి కుర్చీ ముఖ్యమా అనే ప్రచారం సోషల్ మీడియాలో ప్రారంభమైంది. హర్యానా రైతులు ఢిల్లీ సరిహద్దులోని ఆందోళన ప్రాంతానికి రావడం మొదలైనప్పటి

నుండి ఈ ప్రచారం ఊపందుకుంది. ఇది బిజెపిపై మరింత ఒత్తిడి పెంచింది. ఇది ఎంతవరకు వెళ్లిందంటే చౌతాలా రక్షణశాఖ మంత్రి రాజ్‌నాథ్‌సింగ్‌ను కలిసి రైతుల సమస్యలు పరిష్కరించాలని కోరేంత వరకూ వెళ్లింది. రైతుల ఆందోళనను శాంతిపజేసేందుకు ఏదో ఒక ఒప్పందం చేసుకోవాల్సిందేనని కోరాల్సి వచ్చింది.

## హర్యానాలో రైతుల నిరసన

ఈ ప్రక్రియ కొనసాగుతుండగానే మరోవైపు నరేంద్రమోడీ వ్యవసాయ రంగ సంస్కరణలు రైతుల ప్రయోజనాల కోసమేననే ప్రచారాన్ని ప్రధాని ముందుకు తీసుకొచ్చారు. దుష్యంత్ చౌతాలా రాజ్‌నాథ్‌సింగ్ సహాయం కోరడానికి ముందే ప్రధాని ఫిక్కీ సమావేశంలో మాట్లాడుతూ వ్యవసాయ అనుబంధ రంగాల్లో ఉన్న అడ్డంకులను తొలగించడానికి వ్యవసాయ సంస్కరణలు ఉపయోగపడతాయని తెలిపారు. సాంకేతిక పద్ధతులు వినియోగించుకోవడంతోపాటు పెట్టుబడుల నుండి లాభం పొందేందుకు రైతులకు కొత్త మార్కెట్లను సృష్టించడం కోసమే ఈ చట్టాలని తెలిపారు. ఒక రంగం మొదలైనప్పుడు దాని ప్రభావం అనేక ఇతర రంగాలపై పడుతుందని తెలిపారు. పరిశ్రమలు నిర్మించే సమయంలోనే అనేక అడ్డంకులు ఎదురవుతాయని, ఏదీ అంత తొందరగా అభివృద్ధి చెందదని వివరించారు. కొత్త పార్లమెంటు అంశాన్ని ముందుకు తెచ్చి వ్యవసాయ అంశాలను పక్కకు నెట్టేందుకు మోడీ ప్రయత్నం చేశారు. దీనిపై ఎస్‌కెఎం నాయకుడు హర్విందర్‌సింగ్ లఖోవాల్ మాట్లాడుతూ ఒక అంశాన్ని పక్కదారి పట్టించే వ్యూహాల ద్వారా వ్యవసాయ చట్టాలపై జరుగుతున్న చర్చలను పక్కదారి పట్టించేందుకు మోడీ ప్రయత్నిస్తున్నారని తెలిపారు. వారి నాయకత్వం ఇలాగే ముందుకొచ్చింది. ఇలాంటి పద్ధతులు ప్రజాస్వామ్యానికి నష్టం కలిగిస్తాయని తెలిపారు. కానీ, దేశంలో రైతులు మాత్రం ప్రజాస్వామ్యమే నిజమైన అభివృద్ధిని సాధిస్తుందని చెప్పేందుకు సంసిద్ధంగా ఉన్నారని ఆయన తెలిపారు.

**(అనువాదం : వల్లభనేని సురేష్)**

# రైతుల నిరసనలు నాడు-నేడు

-వి. శ్రీధర్

భారత్‌లో వెల్లువెత్తిన రైతాంగ నిరసనలు ఒక మహోద్యమంగా మారాయి. వ్యవసాయ రంగంలో బడా కార్పొరేట్ల ప్రయోజనాలను కాపాడే మూడు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా భారత రైతాంగం అసాధారణ రీతిలో సాగిస్తున్న ఈ చారిత్రాత్మక పోరాటానికి మద్దతు, సంఘీభావం దేశమంతటా వెల్లివిరుస్తున్నాయి. నవంబరు చివరిలో దేశ రాజధాని ఢిల్లీని శీతాకాల అసమ్మతి వణికిస్తున్నది. ఎముకలు కొరికే చలిలో నీటి ఫిరంగులకు ఎదురొడ్డి నిలిచారు. నిందలు, బూటకపు ప్రచారాలు, తప్పుడు కేసులను దీటుగా తిప్పికొడుతూ వీరోచితంగా ముందుకుసాగుతున్నారు. రైతులను ఢిల్లీలో ప్రవేశించకుండా అడ్డుకుంటూ వారిపై నిర్బంధాన్ని ప్రయోగించిన మోడీ ప్రభుత్వం మరో వైపు ప్రజాస్వామ్యం గురించి హితవచనాలు పలుకుతోంది.

మొదట తీసుకొచ్చిన ఆర్డినెన్స్‌లు, ఆ తరువాత వాటి స్థానంలో తెచ్చిన మూడు నల్ల చట్టాలకు వ్యతిరేకంగా గత జూన్‌లో చిన్నగా మొదలైన నిరసనలు నేడు ఒక మహోద్యమంగా మారాయి. స్వాతంత్ర్యానంతర భారత చరిత్రలో కనివిని ఎరుగని రీతిలో ఈ ఉద్యమం సాగుతున్నది. ఉద్యమం విస్తరిస్తున్న కొద్దీ, దీనికి సంఘీభావం కూడా దేశమంతటా వెల్లివిరుస్తోంది. రిటైర్డ్ బ్యూరోక్రాట్లు, యువత, శాస్త్రవేత్తలు, సంఘటిత, అసంఘటిత రంగానికి చెందిన కార్మికులు, క్రీడా ప్రముఖుల నుంచేకాక మాజీ సైనిక అధికారులు, జవాన్లు నుంచి కూడా అపూర్వమైన సంఘీభావం వ్యక్తమవుతున్నది. ఉద్యమానికి మద్దతుగా ధన, వస్తురూపేణా పెద్దయెత్తున సహాయం అన్ని వైపుల నుంచి అందుతోంది. దాదాపు 3లక్షల మంది రాజధాని సరిహద్దులలో ఐదు కేంద్రాల వద్ద నిరసన శిబిరాలు ఏర్పాటు చేసుకుని అకుంఠిత దీక్షతో ఉద్యమిస్తున్నారు. ఈ ఉద్యమాన్ని సరిగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేవారికెవరికైనా ఇది ఏదో రెండు రాష్ట్రాలకు పరిమితమైన ఉద్యమం

కాదని, దేశంలోని అన్ని గ్రామాలకు, పట్టణాలకు, రాష్ట్రరాజధానులకు విస్తరించిన మహోద్యమం అని స్పష్టమవుతుంది. రైతుల పోరాటానికి సంఘీభావంగా కేరళ, కర్ణాటక, ఆంధ్ర ప్రదేశ్, తెలంగాణా, ఒడిశా, తదితర రాష్ట్రాల నుంచి రైతులు గుంపులు గుంపులుగా తరలివస్తున్నారు. ఢిల్లీ సరిహద్దుల్లో సాగుతున్న ఈ పోరాటాన్ని ముప్పై రెండేళ్ల క్రితం మహేంద్రసింగ్ తికాయత్ నేతృత్వంలోని భారతీయ కిసాన్ యూనియన్ (బికెయు) ఆధ్వర్యంలో చేపట్టిన ఆందోళనతో పోల్చడం ఎంత మాత్రం సరికాదు. ఆనాటి ఉద్యమానికి, నేటి ఉద్యమానికి హస్తిమశకాంతరానికి ఉన్నంత తేడా ఉన్నది.

## రైతుల నిరసనలు నాడు-నేడు

1988 అక్టోబరులో తికాయత్ నేతృత్వంలో రైతులు ఢిల్లీలోని బోట్‌క్లబ్ వద్ద ఆందోళన నిర్వహించారు. ఆనాడు అధికారంలో ఉన్న ప్రభుత్వాలు రాజధాని నడిబొడ్డున ర్యాలీలకు అనుమతి ఇచ్చేవి. ఆనాటి ఉద్యమంలో దాదాపు 5లక్షల మంది రైతులు వారం రోజులపాటు బోట్‌క్లబ్ వద్ద ఆందోళన నిర్వహించారు. ఆ నిరసనలను భగ్నం చేయడానికి అప్పటి రాజీవ్ గాంధీ ప్రభుత్వం వేయని పన్నాగం లేదు. రైతులను అక్కడి నుంచి ఖాళీచేసి వెళ్లిపోయేలా చేసేందుకు రాత్రిపూట పెద్దపెద్ద శబ్దాలతో పాశ్చాత్య సంగీతాన్ని హోరెత్తించేది. ఆ ప్రాంతానికి నీరు, ఆహారం సరఫరా కాకుండా పూర్తిగా అడ్డుకోడానికి యత్నించింది. చివరికి వారం రోజుల్లోనే ఎలాంటి ఒప్పందం లేకుండా ఆందోళన విరమించారు. 1988లో జరిగిన నిరసనలకు ఇప్పటి ఉద్యమానికి అసలు పొంతనేలేదు. ఈ రెండింటి మధ్య ఏదైనా సారూప్యత ఉన్నదీ అంటే అది ఆందోళన చేస్తున్న రైతుల మధ్య చీలిక తెచ్చేందుకు మహేంద్రసింగ్ తికాయత్ కుమారుడు రాకేష్ తికాయత్‌ను పావుగా వాడుకోవడానికి మోడీ ప్రభుత్వం చేసిన విఫలయత్నాలే. అయితే ఈ యువ తికాయత్ వెన్నుపోటుదారుడుగా మారటానికి ససేమిరా అన్నారు. గత ఉద్యమానికి, ప్రస్తుత ఉద్యమానికి కొట్టొచ్చినట్లు కనిపించే ముఖ్యమైన మొదటి తేడా ఏమిటంటే తికాయత్ ఉద్యమం కేవలం పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోని ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమైనది. తికాయత్ సొంతజిల్లా ముజఫర్ నగర్ ఈప్రాంతంలోనే ఉంది. మరీ ముఖ్యంగా ఆందోళనకారులంతా జాట్ కులానికి చెందిన చెరకు రైతులు. వీరు తమ చెరకు ధర పెంచాలని, రుణాలను రద్దు చేయాలని, విద్యుత్, వాటర్ చార్జీలపై రాయితీలు ఇవ్వాలన్న డిమాండ్ల చుట్టూనే ఆ ఉద్యమం సాగింది. ఇప్పటి ఉద్యమానికి కూడా అటువంటి ముద్రవేయటానికి బిజెపి, దాని మిత్రపక్షాలు, ప్రభుత్వానికి వెలుపలవున్న కొన్ని వర్గాలు ప్రయత్నించాయి. ఈ ఉద్యమం పంజాబ్, హర్యానా రాష్ట్రాల్లోని ధనిక రైతులు, వ్యాపారులకు మాత్రమే

పరిమితమని చూపే ప్రయత్నమూ చేశారు. నిజానికి ఈ ఉద్యమానికి దేశం నలుమూలల నుంచి రైతులు, వ్యవసాయ కార్మికులు, కౌలు రైతులు ఇతర అన్ని వర్గాలకు చెందినవారి నుంచి మద్దతు లభిస్తున్నది. ఈ నల్ల చట్టాలు తమకు ఆహారాధాన్యాలు సరసమైన ధరలకు లభించకుండా చేస్తాయన్న ఆందోళనతో ఉన్న కార్మికులు కూడా రైతాంగ ఉద్యమానికి బాసటగా నిలిచారు. మూడు దశాబ్దాల క్రితం జరిగిన ఉద్యమానికి ఇటువంటి విస్తృతమైన మద్దతు కానీ, సంఘీభావం కానీ లేదనే విషయం గుర్తుంచుకోవాలి. రెండవ అంశం. 1980ల నాటి నిరసనలకు ఇంతపెద్దఎత్తున ప్రజల మద్దతు లేదు. ప్రభుత్వ అణచివేత చర్యలు ఇప్పుడున్నంతగా అప్పుడు లేవనే చెప్పాలి. హర్యానా నుంచి ఢిల్లీకి రైతులను రానీయకుండా ఆ రాష్ట్ర బిజెపి ప్రభుత్వం తీవ్ర నిర్బంధం ప్రయోగించింది. అయితే వెల్లువలా వచ్చిన నిరసనల ధాటికి అవేవీ అడ్డుకోలేకపోయాయి. పంజాబ్, హర్యానాల నుంచే కాకుండా ఢిల్లీని అనుకుని ఉన్న ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఉత్తరాఖండ్ రాష్ట్రాల నుండి కూడా రైతులు పెద్దఎత్తున ఉద్యమంలో భాగస్వాములయ్యారు. మరో ముఖ్యమైన తేడా ఏమిటంటే తికాయత్ ఉద్యమంలో మహిళల ప్రాతినిధ్యం బొత్తిగాలేదు. నేటి ఉద్యమంలో మహిళా రైతుల ప్రాతినిధ్యం గణనీయంగా ఉంది. తికాయత్ ఆనాటి దళిత ముఖ్యమంత్రిని హేళన చేయడం, ఖాప్ పంచాయితీ గట్టి దన్నుగా నిలవడం, ఆయన ఫ్యూడల్, పెత్తందారీ పోకడలవల్ల చాలా సెక్షన్లు ఆ ఉద్యమానికి దూరంగా ఉన్నాయి. ప్రస్తుత ఉద్యమం ప్రజాతంత్రయుతంగా అన్ని సెక్షన్లవారినీ కలుపుకుపోయే విధంగా ఉంది. అందుకే ధనిక రైతు దగ్గర నుంచి భూమిలేని పేద వ్యవసాయ కార్మికులదాకా అన్నిస్థాయిల్లోనూ రైతాంగం కదిలారు. ముఖ్యంగా నోట్లరద్దు తాలూక వినాశకర పర్యవసానాలు, వ్యవసాయోత్పత్తులకు సరైన గిట్టుబాటు ధర లభించకపోవడం.. ఇవన్నీ రైతులను ఉద్యమం వైపు నడిపించాయి. ఒకవైపు వ్యవసాయ ఖర్చులు భారీగా పెరిగిపోవడం, మరోవైపు పండించిన పంటలకు ధరలు పడిపోవడంతో రైతుల పరిస్థితి అడకత్తెరలో పోక చెక్కలా తయారయింది. పంట దిగుబడి పెరిగినా నష్టాలు తప్పలేదు. గత ఉద్యమానికి, ఈ ఉద్యమానికి మధ్య ఉన్న ఇంకో ముఖ్యమైన తేడాఏమిటంటే, ఆనాడు తికాయత్, కర్నాటకలో యండి నంజుండస్వామి , మహారాష్ట్రలో శరద్‌జోషి వంటి వ్యక్తుల చుట్టూ ఉద్యమాలు నడిచేవి. ఇప్పుడు ఈ ఉద్యమానికి జనాకర్షణగల నాయకులు లేకపోవడం బలహీనతకు సంకేతంగా కొందరు చూపిస్తున్నారు. నిజానికి ఈ ఉద్యమానికున్న బలం అదే. ఇది 500లకు పైగా రైతు సంఘాలు ఒకేవేదిక మీదకు రావడానికి, ఈ ఉద్యమం ప్రజాతంత్రయుతంగా, ఇంత పట్టుదలగా సాగుతోందంటే సమిష్టి నాయకత్వం కలిగి ఉండటమే. ఆనాటి ఉద్యమం ఢిల్లీలో ప్రవేశించినప్పటికీ అంతగా ప్రభావం

చూపలేకపోయింది. కానీ, నేటి ఉద్యమం గమ్యస్థానానికి చేరుకోకపోయినా యావత్ దేశాన్ని కదిలించివేసింది.

## చర్చల ప్రహసనం

వివాదాస్పద చట్టాల రద్దుకు ప్రభుత్వం మొండిగా తిరస్కరిస్తుండడంతో రైతుసంఘాలతో చర్చలు ఓ ప్రహసనంగా తయారయ్యాయి. ఈ పోరాటం ఎన్నో రోజులు సాగదులే అన్న ధీమాతోనో లేక రైతాంగ ఉద్యమంలో చీలికలు తెచ్చి నిర్వీర్యం చేయచ్చన్న కుతంత్రంతోనో ప్రభుత్వం చర్చలపట్ల మొదటి నుంచి సాచివేత ధోరణి అనుసరిస్తుంది. మూడు నల్లచట్టాలను తీసుకురావటానికి, వాటిని రద్దు చేయాలన్న రైతుల డిమాండ్‌ను మొండిగా తిరస్కరించడానికి ఒకటే కారణం. బడా వ్యాపారులకు వ్యవసాయరంగాన్ని కట్టబెట్టడమే ప్రభుత్వ ధ్యేయంగా ఉన్నది. అయితే, రైతులు కూడా ఈ నల్లచట్టాలను రద్దుచేయాల్సిందేనని భీష్మించుకోవడంతో ప్రభుత్వం ఇరకాటంలో పడింది. రైతుల పోరాటానికి అంతకంతకూ పెరుగుతున్న మద్దతు దాన్ని బెంబేలెత్తిస్తుంది. అందుకే కనీస మద్దతుధర (ఎంఎస్‌పి), ఇతర చిన్నచిన్న అంశాలపై సవరణలు తీసుకొస్తానని సంకేతాలిచ్చింది. అయినా రైతుల్లో ఆగ్రహం చల్లారలేదు. ప్రభుత్వం చేసిన ప్రతిపాదన రైతులు నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. కారణం వ్యవసాయ మార్కెట్ కమిటీ(ఎపిఎంసి)లు లేకుండా కనీస మద్దతు ధర ఉన్నా ఒకటే, ఊడినా ఒక్కటే. మార్కెట్ కమిటీలను నాశనం చేసేందుకే ప్రభుత్వం వీటి లావాదేవీలపై భారీగా ఫీజులు, ఇతర భారాలను మోపింది. ప్రైవేట్ మార్కెట్ శక్తులకు మాత్రం ఈ నిబంధనలేవీ వర్తించకుండా తగు ఏర్పాట్లు చేసింది.

సన్న చిన్నకారు రైతులకు అందుబాటులో ఉండే వ్యవసాయ ఉత్పత్తుల మార్కెటింగ్ కమిటీ (ఎపిఎంసి) వ్యవస్థను విస్తరింపచేయాలన్నది రైతు ఉద్యమం ప్రధాన డిమాండ్లలో ఒకటి. దీనిపై ప్రభుత్వం ఎటువంటి హామీ ఇవ్వడానికి సిద్ధంగా లేదు. కేరళలో ఎపిఎంసి వ్యవస్థ లేనప్పటికీ ఆ రాష్ట్ర ప్రభుత్వం కనీస మద్దతు ధరకన్నా అధిక ధరకు వ్యవసాయ ఉత్పత్తులను సేకరిస్తున్నది. మోడీ ప్రభుత్వం నిర్ణయించిన ఎంఎస్‌పి రైతు పెట్టే పెట్టుబడి వ్యయానికి తగినట్లుగా లేదు. దాన్నికూడా ఇప్పుడు ఉనికిలో లేకుండా చేసింది. మొదటిసారి మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత ఎన్నికల హామీలన్నింటినీ తుంగలోతొక్కింది. ఎన్నికల ముందు రైతు పండించిన పంటకు అయ్యే మొత్తం వ్యయంపై అదనంగా 50శాతం రాబడి వచ్చేలా ఎంఎస్‌పి ప్రకటిస్తామని హామీ ఇచ్చింది. ఎం.ఎస్. స్వామినాథన్ కమిటీ 2004-06 మధ్య విస్తృతంగా అధ్యయనం చేసి రైతాంగంలో అశాంతికి కారణాలు, పరిష్కారాలకు సంబంధించి ఐదు నివేదికలు ఇచ్చింది. వాటిలో వేటినీ ప్రభుత్వం ఇంతవరకూ

అమలుచేయలేదు. ఈ సిఫారసులను అమలుచేయాలని రైతు ఉద్యమం డిమాండ్ చేస్తున్నది. కనీస మద్దతు ధర నిర్ణయించడంలో స్వామినాథన్ కమిటీ సూచించిన ప్రాతిపదికలు కూడా మోడీ ప్రభుత్వం పాటించలేదు. స్వామినాథన్ కమిటీ సిఫారసుల ప్రకారం రైతు పెట్టే పెట్టుబడి, భూమికి చెల్లించే లీజు, వ్యవసాయ రుణంపై వడ్డీ, రైతు చేసే శ్రమ వీటన్నింటినీ లెక్కించి ఎంఎస్‌పి నిర్ణయించాలి. కానీ, మోడీ ప్రభుత్వం పెట్టుబడి వ్యయాన్ని ప్రాతిపదికగా తీసుకుని ఎంఎస్‌పి నిర్ణయించింది. ఇది ఒకరకంగా రైతును దగా చేయడమే. ప్రభుత్వం ప్రకటించే ఎంఎస్‌పికి, రైతు పెట్టే పెట్టుబడికి మధ్య వ్యత్యాసం మోడీ ప్రభుత్వ హయాంలో భారీగా పెరిగింది. రైతు పెట్టే పెట్టుబడితో పోల్చినపుడు ఎంఎస్‌పి 12శాతం తక్కువగా ఉంది. ఈ ఎంఎస్‌పి కూడా అన్ని పంటలకు అమలుకావడంలేదు. ఎంఎస్‌పి ప్రకటించిన చాలా పంటలను ఆ ధరకు కొనుగోలు చేసిన దాఖలాలు లేవు. గోధుమ, వరి మినహా చాలా పంటలు ఎంఎస్‌పి కంటే తక్కువకే అమ్ముకోవలసిన అగత్యం ఏర్పడింది. ఇప్పుడు ఆ ఎంఎస్‌పి కూడా లేకపోతే రైతుల పరిస్థితి ఇంకెంత దారుణంగా ఉంటుందో ఊహించుకోవచ్చు. అందుకే ఎంఎస్‌పికి చట్టబద్ధత కల్పించాలని రైతు ఉద్యమం పట్టుపడుతున్నది. మోడీ ప్రభుత్వ వ్యవహార తీరు చూశాక ఎంఎస్‌పిని చట్టంలో చేర్చినా అది గ్యారెంటీగా అమలు జరుగుతుందన్న భరోసా లేదు. ఎందుకంటే ఆహారధాన్యాల సేకరణలో కీలకభూమిక వహించే భారత ఆహార సంస్థ (ఎఫ్‌సిఐ)ని కేంద్రమే సమాధి చేయాలని చూస్తోంది. ఎఫ్‌సిఐని నిర్వీర్యం చేశాక రైతుపరిస్థితి మరింత దయనీయంగా తయారవుతుంది. అంతేకాదు, ప్రజల ఆహారభద్రతను కూడా ఇది ప్రశ్నార్థకం చేస్తుంది. కోవిడ్-19 వంటి విపత్తులు వచ్చినప్పుడు ప్రజలకు ఆహార ధాన్యాల పంపిణీలో బృహత్తరమైన పాత్రను ఎఫ్‌సిఐ పోషిస్తున్నది. ఎఫ్‌సిఐని ఎత్తివేసి ఈ భారాన్ని కేంద్రం రాష్ట్రాలపైకి నెట్టివేయాలని చూస్తోంది. ఇప్పటికే రాష్ట్రాల పరిధిలోని వ్యవసాయ రంగాన్ని కేంద్రం తన గుప్పెట్లో పెట్టుకున్నది.

## మోడీ ప్రభుత్వ అసలు ఉద్దేశ్యం

రిటైల్ రంగంపై కన్నేసిన బడా వ్యాపార సంస్థలకు పెద్దఎత్తున లాభాలు చేకూర్చిపెట్టేందుకు సప్లై చెయిన్‌ను దానికి అనుగుణంగా మార్చేందుకే మోడీ ప్రభుత్వ ఈ నల్ల చట్టాలను తీసుకువచ్చింది. తక్కువ వ్యవధిలో ఎక్కువ లాభాలు పిండుకునేలా చేయడమే ఈ చట్టాల ఉద్దేశ్యం. దీనివల్ల అంబానీ, టాటా, బిర్లా, రహేజా, ఆర్‌పిజి గ్రూప్, ఫ్యూచర్స్‌గ్రూప్ వంటి దేశీయ వ్యాపార దిగ్గజాలే కాకుండా విదేశీ బహుళజాతి కంపెనీలు కూడా ఈ రంగంలో చొరబడేందుకు మోడీ ప్రభుత్వం బాటలు వేసింది. బట్టలు ఇతర చిల్లర వర్తకాల్లోకన్నా వ్యవసాయ ఉత్పత్తుల మార్కెటింగ్ అతిపెద్ద ఆదాయవనరుగా ఈ కంపెనీలు భావిస్తున్నాయి. అయితే, ఈ రంగంలో పెట్టుబడులు

పెట్టి లాభాలు సరిగా రాకపోవడంతో ఈ కంపెనీలు నిరాశచెందాయి. రిలయన్స్ ఫ్రూట్స్ & వెజిటబుల్స్ రిటైల్ చెయిన్ ఆశించిన ఫలితాన్ని ఇవ్వలేకపోయింది. కిషోర్ బియాని నేతృత్వంలోని ఫ్యూచర్ గ్రూప్ పదేళ్ల క్రితం ఈరంగంలో అడుగుపెట్టి లాభాలు అంతగా లేకపోవడంతో వెనక్కిపోయింది. ఎపిఎంసి, ఎంఎస్‌పి వ్యవస్థలను నాశనం చేస్తే తప్ప తమకు ఇబ్బడి ముబ్బడిగా లాభాలు రావని దేశీయ, విదేశీ కార్పొరేట్ సంస్థలు భావించాయి. మోడీ ప్రభుత్వం ఈ బడావ్యాపారవేత్తల ప్రయోజనాల కోసమే రిటైల్ చెయిన్ వ్యవస్థను ధ్వంసం చేయడానికి పూనుకున్నది. వ్యవసాయ ఉత్పత్తి రంగంలో పెట్టుబడులు పెట్టకుండా కేవలం సప్లై రంగం వైపే బడా వ్యాపారవేత్తలు ఎక్కువ మొగ్గుచూపడానికి కారణం ఉత్పత్తి ప్రక్రియ దీర్ఘకాలికమైనది, అనేక వ్యయ ప్రయాసలతోకూడినది కావడమే. సులువుగా లాభాలు ఆర్జించేందుకు సేకరణ, మార్కెటింగ్ చెయిన్‌ను, పూర్తిగా తమ అదుపులో ఉంచుకోవాలని మార్కెట్ శక్తులు కోరుకుంటున్నాయి. ప్రత్యేక సప్లై చెయిన్‌ను ఏర్పాటు చేయడం ద్వారా ఈ రంగంలో తమ గుత్తాధిపత్యం నెలకొల్పుకోవచ్చని తద్వారా గరిష్టస్థాయిలో లాభాలకు గ్యారెంటీ ఉండేలా చూసుకోవాలని అవి భావిస్తున్నాయి. కాంట్రాక్ట్ వ్యవసాయానికి సంబంధించి తీసుకొచ్చిన కొత్తచట్టం ఈ రంగంలో కార్పొరేట్ల ప్రవేశానికి తలుపులు తెరిచింది. రైతులను తమ భూముల నుంచి వెళ్లగొట్టేలా చేయడమే ఈ చట్టం అసలు ఉద్దేశం. ప్రజాపంపిణీ వ్యవస్థను నిర్వీర్యం చేసేందుకు కేంద్రం ఈ చట్టాల్లో కొన్ని నిబంధనలను పెట్టింది. ఇప్పటికే నగదు బదిలీపేరుతో ఆహారా ధాన్యాలకు బదులు సబ్సిడీని నగదురూపంలో చెల్లించేందుకు ప్రభుత్వంపథక రచన చేసింది. ఆహార ధాన్యాలు పంపిణీ చేస్తే పేదల పళ్లెంలోకి ఆహారం వస్తుంది. నగదు బదిలీ వల్ల లబ్ధిదారులకు ఒనగూరే ప్రయోజనం అంతగా ఉండదు. సబ్సిడీ పరిమితంగా ఉండి కొనుక్కునే ఆహార ధాన్యాల ధర మార్కెట్‌లో పెరుగుతున్నప్పుడు ఆ సబ్సిడీ నగదు ఏమూలకీ చాలదు. అప్పుడు పేదవాడికి కనీస పరిమాణంలో తిండిగింజలు దొరకడం గగనమవుతుంది. ఇది ఆకలి చావులను పెరగడానికి దారితీయొచ్చు. ఇప్పటికే 117దేశాలతో కూడిన ప్రపంచ ఆకలిసూచీలో భారత్ 102వ స్థానంలో ఉంది. పిడిఎస్ లేకపోతే పరిస్థితి మరింత దారుణంగా తయారవుతుంది. అంతేకాదు, ఈ పంపిణీ వ్యవస్థ ఒకసారి కార్పొరేట్ చేతుల్లోకిపోతే ఆహార ద్రవ్యోల్బణాన్ని కట్టడిచేయడం ఎవరి తరమూ కాదు. ప్రభుత్వం దగ్గర పెద్దఎత్తున ఆహారధాన్య నిల్వలు ఉన్నప్పుడే ధరల పెరుగుదలకు అడ్డూ అదుపు లేకుండాపోతున్నది. అది కూడా లేకపోతే పేదల పరిస్థితి మరీ దారుణంగా ఉంటుంది. ఈ నూతన చట్టాలు వచ్చిన తర్వాత వ్యాపారులు ఆహార ధాన్యాలను ఎంతైనా దాచుకోవచ్చు. కృత్రిమ కొరత సృష్టించి మార్కెట్‌లో ధరలు విపరీతంగా పెంచుకోవచ్చు. ఆహారధాన్యాల

సేకరణలోనూ, పంపిణీలోనూ ప్రభుత్వ పాత్ర లేకుండా చేయడమే ఈ చట్టాల ఉద్దేశం. అందుకే ఈ మూడు చట్టాలను విడివిడిగా కాకుండా మొత్తంగా చూసినపుడే వీటి ప్రమాదం అర్థమవుతుంది. ఈచట్టాల ప్రమాదం గురించి, ప్రభుత్వ వినాశకర పంథా వల్ల వచ్చే కీడు గురించి రైతులకు అర్థమయింది. ఈ నల్లచట్టాలను రద్దు చేయాలని ఇంతగా పట్టుపట్టడానికి కారణం ఇదే.

రైతాంగాన్ని అంతటినీ ఏకం చేయడం అనేది చాలా కష్ట సాధ్యంతో కూడుకున్న పని. అయినప్పటికీ కింది స్థాయిలో ఉన్న పేద వ్యవసాయకార్మికుడు మొదలుకొని, వందల ఎకరాలుండే ధనిక రైతు వరకు అందరూ ఐక్యంగా కదలిరావడం ఈ ఉద్యమం ప్రత్యేకత. గ్రామీణ సామాజిక ఆర్థిక నిర్మాణంలో వ్యవసాయ కార్మికుడు అట్టడుగున ఉంటాడు. అతనికి భూమి ఉండదు. కొద్దో గొప్పో భూమి ఉన్న సన్న, చిన్నకారు రైతులకేమో తగినంత పని ఉండదు. కౌలుదారుడు ఇతరుల వద్ద భూమి తీసుకుని దానిపై శ్రమ చేస్తాడు. నిచ్చెనమెట్లలాంటి ఈ వ్యవస్థలో పైన ఉన్న బడా భూస్వాములు, ధనిక రైతులవద్ద కావలసినంత భూమి ఉంటుంది. వారు ఆ భూమిపై కనీస శ్రమ కూడా చేయరు. దీనికి తోడు కుల, మతాలవిభజన, ఫ్యూడల్ పెత్తందారీతనం ఇలా.. అనేక వైరుధ్యాలతో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ కూడుకున్నది. ఇన్ని వైరుధ్యాలున్నప్పటికీ అన్ని తరగతుల రైతులను, కూలీలను ఈ ఉద్యమం ఒకే గొడుగు కిందికి తీసుకువచ్చిందంటే దానికి కారణం వ్యవసాయరంగం మొత్తంగానే ప్రమాదంలో పడటమే. ధనికరైతుల్లోనూ, గ్రామీణప్రాంతాల్లో సంపన్నవర్గాల్లోనూ ఇంతగా ఆందోళన నెలకొనడానికి కారణం భూమిపై వారికి ఉన్న పట్టు పూర్తిగా చేజారిపోతుందన్న భయమే. భూమిపై ఉన్న పట్టుతోనే వారు గ్రామీణ ప్రాంతాల్లో అధికారం, వ్యవసాయోత్పత్తుల వ్యాపారంలో తిరుగులేని ఆధిపత్యాన్ని కలిగివున్నారు. ఆ భూమే లేకుంటే మొత్తంగా తమ ఉనికే ప్రశ్నార్థకంగా మారుతుంది. రిటైల్ సప్లై చెయిన్ ఇంతవరకు వీరి అధీనంలో ఉంది. ఇప్పుడు ఈ రంగంలో కార్పొరేట్లు ప్రవేశిస్తే గ్రామీణ ప్రాంతాల్లో వీరి పెత్తనం పోతుంది. ఆ రీత్యా కూడా ఈ వర్గాలు కార్పొరేట్లకు వ్యతిరేకంగా నిలవాల్సి వస్తుంది.

వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా సాగుతున్న ఉద్యమం తమ డిమాండ్లను సాధించుకున్నా, లేకున్నా అది ఒక రకంగా విజయం సాధించినట్లే లెక్క. ప్రభుత్వ విధానాలపై రైతాంగం యావత్తూ సమిష్టిగా తిరగబడాలన్న చైతన్యమే ఒక విజయం. ఏవో ఒకటీ రెండు అపజయాలు ఎదురయినా పోరాటం ద్వారానే ఏదైనా సాధించుకోవచ్చున్న విశ్వాసాన్ని, స్ఫూర్తిని ఈ ఉద్యమం ఇస్తున్నది.

**(అనువాదం : కె.గడ్డెన్న)**

# సాగు, ఉత్పత్తి పెరిగినా రైతులకు ఏమీ మిగల్లేదు!!

- తపన్ సింగ్ మోదక్

2020-21 ఖరీఫ్‌లో వ్యవసాయ ఉత్పత్తి పెరిగింది. ఇదే సమయంలో రైతులకు పంటలు పండించడానికి అయ్యే ఖర్చులు పెరిగాయి. ఇంకో వైపు రైతులు పంటలు అమ్ముకుంటున్న వేళ ధరలు పడిపోయాయి. ఫలితంగా రైతులకు ఏమీ మిగల్లేదు. పంటలు బాగా పండితే వ్యవసాయదారులకు మంచి లాభాలొస్తాయనడం తప్పుడు అవగాహన. సాగు లాభదాయకమో, కాదో తెలియాలంటే పంటలు పండించడానికి పెట్టే పెట్టుబడులకు, పంటలు అమ్మగా వచ్చిన రొక్కానికి మధ్య వ్యత్యాసాన్ని లెక్కకట్టాలి. పెట్టుబడుల కంటే పంట అమ్మగా వచ్చిన మొత్తం ఎక్కువైతేనే లాభదాయకం అయినట్లు. పంటలు పండినంత మాత్రానే ఫలితం తెలీదు. వాస్తవంగా రైతాంగం పంటలను ఎంతకు అమ్ముకున్నారో తేలినప్పుడే అసలు విషయం బోధ పడుతుంది. కానీ, కేంద్ర ప్రభుత్వం 'కోవిడ్-19' సంక్షోభం ఉన్నప్పటికీ దేశంలో సాగు విస్తీర్ణం, దిగుబడులు పెరిగినందున వ్యవసాయం బాగుందని ప్రచారం చేస్తోంది. సర్కారు తీసుకొచ్చిన మూడు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా రైతాంగం పెద్ద ఎత్తున ఉద్యమిస్తున్న తరుణంలో ప్రభుత్వం ఇలాంటి ప్రచారాన్ని లంకించుకుంది.

2020 ఖరీఫ్‌లో ఇంతకుముందు కంటే సాగు విస్తీర్ణం పెరిగిన మాట నిజం. విస్తీర్ణం పెరిగినందున ఆ మేరకు దిగుబడులు పెరుగుతాయి. 2019-20 ఖరీఫ్‌లో కంటే 2020-21లో 5.7 శాతం సాగు విస్తీర్ణం పెరిగింది. సాగు పెరగడానికి ప్రధాన కారణం ఈ మారు సకాలంలో రుతుపవనాలొచ్చి మంచి వర్షాలు కురవడమే. భారత వ్యవసాయ మంత్రిత్వశాఖ 2020 సెప్టెంబర్ 22న విడుదల చేసిన మొదటి ముందస్తు అంచనాల ప్రకారం 144.52 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాల

దిగుబడులు లభించనున్నాయి. గతేడాది 143.38 మిలియన్ టన్నులు లభించాయి. పప్పుదాన్యాల దిగుబడులు 9.3 మిలియన్ టన్నులు లభించనున్నాయి. గతేడాది కంటే 20 శాతం ఎక్కువగా పప్పుధాన్యాలు లభించనున్నాయి. ప్రధానంగా వరి ధాన్యం దిగుబడి 102.4 మిలియన్ టన్నులొస్తాయని, నిరుటి కంటే అధిక ఉత్పత్తి జరుగుతుందని ప్రభుత్వం అంచనా వేసింది. ఆహార పంటలే కాదు, నూనెగింజలు ఈ తడవ 25.7 మిలియన్ టన్నులొస్తాయని, నిరుటి కంటే 15 శాతం అధికమని, వాణిజ్య పంటల్లో చెరకు, పత్తి సైతం గతేడాది కంటే ఈ సారి ఎక్కువ ఉత్పత్తి వస్తుందని సర్కారు పేర్కొంది.

## ఎఫ్ఎఎస్ సర్వే

పెరిగిన పంటల ఉత్పత్తి భారత గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయదారుల ఆదాయాలను పెంచిందా? ఫౌండేషన్ ఫర్ అగ్రేరియన్ స్టడీస్ (ఎఫ్ఎఎస్) అనే సంస్థ ఇటీవల జరిపిన సర్వేలో రైతుల ఆదాయాలు పెంచలేదని గుర్తించడంతో పాటు పలు ఇతర ముఖ్యమైన నిర్ధారణలు చేసింది. కరోనా మహమ్మారి సమయంలో ప్రజల జీవనం, ఉత్పత్తి, గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి అనే అంశాలపై ఎఫ్ఎఎస్ స్టడీ గ్రూపు టెలిఫోన్ ద్వారా 13 రాష్ట్రాల్లోని 26 గ్రామాలకు చెందిన 164 కుటుంబాల నుంచి సమాచారం సేకరించి విశ్లేషించింది. ఈ సర్వే నిరుడు సెప్టెంబర్, అక్టోబర్‌లో నిర్వహించింది. వ్యవసాయంలో, పంటల సాగులో వచ్చిన మార్పులను గుర్తించింది. పంటల సాగు కోసం ఖర్చుల పెరగుదలను గుర్తించింది. ముఖ్యంగా విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు, ఇరిగేషన్, కూలీలు, యంత్రాలు, రుణాలు... ఈ పెట్టుబడులు పెరిగినట్లు సర్వేలో తేలింది. అధ్యయన ప్రధాన నిర్ధారణ.. అధిక ఆహార ధాన్యాల ఉత్పత్తి రైతుల ఆదాయాలను అంతే అధికంగా పెంచట్లేదు. ఈ విషయంలో భూస్వాములు, ధనిక, మధ్యతరగతి, చిన్న, సన్నకారు అనే తేడా లేదు. ఉత్పత్తి పెరిగినంత మాత్రాన వ్యవసాయ కూలీల ఆదాయాలూ పెరగలేదు. సాగు విస్తీర్ణం, ఉత్పత్తి పెరుగుదల ఏం వివరిస్తోంది? ప్రాంతాల వారీగా పరిస్థితులు కొంత భిన్నంగా ఉన్నప్పటికీ మొత్తంగా చూస్తే వాతావరణం అనుకూలించడం వలన పంటల సేద్యం జరిగింది. అదే వ్యవసాయ సంక్షోభాన్ని నివారించదు.

బీహార్ ఉదాహరణ ఏమంటే.., ఉత్తర ప్రాంతంలోని రెండు గ్రామాల్లో చేసిన పరిశీలన మేరకు అక్కడి కూలీలందరూ సంప్రదాయంగా పనుల కోసం వేరే ప్రాంతాలకు వలసలు వెళతారు. వారిలో అత్యధకులు భూమి లేని నిరు పేద కార్మికులు. లాక్‌డౌన్ మూలంగా ఊళ్లకు వచ్చిన కార్మికులు, అన్‌లాక్ తర్వాత కూడా తిరిగి



వనులకు వలన వెళ్లలేదు. గ్రామంలోనే చిన్న పాటి భూమిని కౌలుకు తీసుకొని వ్యక్తిగత తిండి అవసరాల కోసం సొంతంగా వ్యవసాయం చేస్తున్నారు. బీహార్ సమస్తిపూర్ జిల్లా నయనగర్ గ్రామానికి చెందిన ఒక ఎస్‌సి వలస కూలి అధ్యయన బృందంతో మాట్లాడుతూ 'జీవితంలో మొదటి సారి పది కొట్టాల (కొట్టా అంటే 0.04 ఎకరాలు) భూమిని కౌలుకు తీసుకున్నాను. కుటుంబానికి అవసరమైన తిండి గింజల కోసం వరి పంట వేశాను' అని చెప్పాడు. పంజాబ్ తెహంగ్ గ్రామానికి చెందిన 30 ఎకరాల ధనిక రైతు మాట్లాడుతూ అదనపు ఆదాయం కోసం ఈ సారి అదనంగా ఐదెకరాలను కౌలుకు తీసుకొని వరి వేశాడు. ఈ రెండు ఉదాహరణలూ వ్యవసాయంలో ఆదాయాల సమస్యను తేటతెల్లం చేస్తున్నాయి.

రుతుపవనాలు ఆశాజనకంగా ఉన్నందున మెట్ట, కాల్వల కింద అనే భేదం లేకుండా సాగు ఈ మారు సాగు పెరిగింది. ఎప్పుడూ విత్తనం పడని బీడు భూములూ పచ్చగా కనిపిస్తున్నాయి. తమిళనాడు నాగపట్నం జిల్లా పాలకురిచి, వేనమణి గ్రామాల్లో సాగుకు ఈ దశాబ్దంలోనే తొలిసారి కావేరి పరిధిలోని మెట్టూరు డ్యాం నుంచి జూన్‌లోనే ఖరీఫ్‌కు నీరు విడుదల చేశారని, స్వల్ప కాలవ్యవధి వరి రకాన్ని సాగు చేశామని వేనమణి గ్రామానికి చెందిన పెద్ద రైతు సర్వే టీంకు తెలిపాడు. కావేరి జలాల కోసం కర్నాటక-తమిళనాడు మధ్య ఆందోళనలు జరగడం తెలిసిందే.

## ఖర్చులు పెరిగాయి

కోవిడ్ సమయంలో సాగు, దిగుబడులు ఆశాజనకంగా ఉండటం అనుకూలాంశం కాగా వ్యవసాయ పెట్టుబడులు విపరీతంగా పెరగడం ప్రతికూలాశం. దేశ వ్యాప్తంగా ఖరీఫ్ వ్యవసాయ పెట్టుబడులు బాగా పెరిగాయని ఎఫ్ఎఎస్ సర్వేలో వెల్లడైంది. మొదటి అంశం... విత్తనాలు, ఎరువుల వంటి వ్యవసాయ ఉత్పాదకాలు, మిషనరీ, కూలీల ఖర్చులు పెరిగాయి. ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా అనంతవరం గ్రామ రైతు మాట్లాడుతూ డీలర్ల వద్ద ఎరువుల లభ్యత తక్కువగా ఉన్నందున గత

ఏడాది కంటే ఇప్పుడు ఎకరా వరికి రూ.1,150 నుంచి 1,300కు ధరలు పెరిగాయన్నాడు. బీహార్‌లోని గ్రామాల్లో యూరియా కొరత ఏర్పడిందని రైతులు తెలిపారు. దాని వలన 46 కిలోల యూరియా బస్తా రేటు రూ.350 నుంచి 400కి కొలాల్సి వచ్చిందన్నారు. పంజాబ్‌లోని హకమవాల గ్రామానికి చెందిన రైతు స్పందిస్తూ 'లాక్‌డౌన్‌లో కాటన్ సీడ్ ప్యాకెట్‌పై రూ.50 పెరిగింది' అని చెప్పాడు. ఎకరానికి విత్తనాల ఖర్చు రూ.2,400 నుంచి 2,600కి పెరిగిందన్నాడు. రెండవ అంశం.. లాక్‌డౌన్‌లో డీజిల్ రేట్లు పెంచడం వలన వ్యవసాయ ఖర్చులు పెరిగిపోయాయి. ఢిల్లీలో నిరుడు జూన్ 1న లీటర్ డీజిల్ రూ.69.39 ఉండగా జూన్ 30న రూ.80.53కి పెరిగింది. ముప్పై రోజుల్లో 16 శాతం పెరిగింది. జూన్ మాసం ఖరీఫ్ పనుల ప్రారంభ సమయం. రైతులు తమ భూములను సేద్యానికి అనుకూలంగా సిద్ధం చేస్తారు. ఇరిగేషన్, నాట్లు, విత్తనాలు వేయడం, మందుల పిచికారీ వంటి పనులకు చాలా రాష్ట్రాల్లో విరివిగా యంత్రాలను ఉపయోగిస్తారు. డీజిల్ రేట్లు పెరగడం వలన రైతులకు పెట్టుబడులు పెరిగాయి. చిన్న సన్నకారు రైతులు యంత్రాలను పెద్ద సంఖ్యలో పెట్టుకోలేరు కనుక వారిపై ధరల భారం అధికంగా పడింది. గతేడాది కంటే ఈ తడవ మిషనరీ అద్దెలు ఏకంగా పది నుంచి 70 శాతం పెరిగాయి. మూడవ అంశం... లాక్‌డౌన్ వలన అంతర్రాష్ట్ర, అంతర్ జిల్లా, చివరికి గ్రామం నుంచి గ్రామానికి సైతం వలస కార్మికుల రవాణా నిలిచిపోవడంతో వ్యవసాయ పనులకు కూలీలకు తీవ్ర కొరత ఏర్పడింది. కూలీల కదలికలపై పోలీస్, ట్రాన్స్‌పోర్టు వేధింపులు సరేసరి. కూలీల కొరతతో స్థానిక కూలీలపై ఆధారపడ్డందున డిమాండ్ పెరిగి కూలి రేట్లు పెరిగాయి. పంజాబ్‌లోని తెహంగ్ గ్రామంలో వరి నాట్లు వేయడానికి ఎన్నో ఏళ్లుగా సంప్రదాయంగా బీహార్, జార్ఖండ్, ఉత్తరప్రదేశ్ తదితర రాష్ట్రాల నుంచి కూలీలు వస్తారని, లాక్‌డౌన్ వలన ఈ తడవ రాకపోవడంతో కూలీల సమస్య తీవ్రమైంది. ఒక ఎకరంలో వరి నాట్లకు కూలీల ఖర్చు రూ.3 వేల నుంచి 5 వేలకు పెరిగింది. వ్యయం 67 శాతం పెరిగింది. మధ్యప్రదేశ్ ఘర్‌సొండి గ్రామానికి చెందిన భూస్వామి వరి నాట్ల కోసం బీహార్ నుంచి కూలీలను తన సొంత ట్రాన్స్‌పోర్టు ద్వారా రప్పించినట్లు సర్వే బృందానికి తెలిపాడు. ఎపిలోని అనంతవరం, బుక్కచర్ల, మహారాష్ట్ర నిమ్షిర్గావ్, పశ్చిమబెంగాల్ పనహార్ గ్రామాల రైతులు పొరుగు ఊళ్లు, జిల్లాలపై కూలీల కోసం ఆధారపడటంతో కూలి రేట్లు ఎక్కువ చెల్లించాల్సి వచ్చింది. పశ్చిమబెంగాల్ బంకుర జిల్లా పనహార్ గ్రామానికి చెందిన రైతు మాట్లాడుతూ 'పశ్చిమ ప్రాంతంలోని కూలీలను ప్రత్యేకంగా వరి నాట్లకు వస్తారు. నైపుణ్యంతో వేస్తారు. ఈ సారి రాలేదు. స్థానిక కార్మికులకు ఎక్కువ అదీ ఎకరాలు కాకుండా

కొంత కొంత భాగాలకు (పీస్ రేట్) కూలి ఇవ్వాల్సి వచ్చింది. పీస్‌కు రూ.3 వేల నుంచి 3,500 ఇవ్వాల్సి వచ్చింది' అని వివరించాడు. త్రిపుర ముహిరిపూర్ గ్రామానికి బంగ్లాదేశ్ నుంచి ప్రతి ఏగా ఖరీఫ్ పనులకు కూలీలు వలస వస్తారు. లాక్‌డౌన్ వలన ఈ ఏడాది రాలేదు.

## అధిక ధరలు

ఎఫ్ఎఎస్ సర్వే చేసే సమయానికి ఇంకా ఖరీఫ్ పంట కోతలు పూర్తవలేదు. దాంతో రైతులు పంటలను ఎంతకు అమ్ముకున్నారు అనే సమాచారం సేకరించలేదు. అయితే, ఈ సంస్థకు చెందిన అగ్రేరియన్ రిలేషన్స్ ఇన్ ఇండియా అనే ప్రాజెక్టు గతంలో చేసిన అధ్యయనాల మేరకు రైతులు ప్రభుత్వం ప్రకటించిన కనీస మద్దతు ధర (ఎంఎస్‌పి) కంటే తక్కువకు పంటలను అమ్ముకుంటున్నారు. ముఖ్యంగా చిన్న, సన్నకారు రైతులు తమ పంటలు అమ్ముకోడానికి స్థానిక వ్యాపారులపై ఆధారపడుతున్నారు. వాస్తవానికి రైతులు తాము పంటలు పండించడానికి పెట్టిన పెట్టుబడి కంటే తక్కువకు పంటలను అమ్ముకుంటున్నారు. కోవిడ్-19 లాక్‌డౌన్ సమయంలో 2020 మార్చి, ఏప్రిల్ మాసాల్లో ఎఫ్ఎఎస్ మచ్చుకు చేసిన సర్వే ప్రకారం రబీ పంటలు వచ్చే సమయానికి మార్కెట్ మొత్తం స్తంభించిపోయింది. దాంతో పంటలు అమ్ముకునే దిక్కులేక చిన్న, సన్నకారు రైతులు భారీగా నష్టపోయారు. రవాణా, పంపిణీ వ్యవస్థలు నిలిచిపోవడం ప్రధాన కారణం. ఈ సంక్షోభంలో పండిన పంటలకు ఎంఎస్‌పిని గ్యారంటీ చేయకపోవడం వలన దేశ వ్యాప్తంగా చిన్న, సన్నకారు రైతులు నష్టపోయారు.

## ధాన్యం సేకరణ

ఉదాహరణకు, దేశంలో వరి ప్రధాన పంట. అందుబాటులో ఉన్న ప్రభుత్వ గణాంకాల ప్రకారం 2018-19లో పండిన మొత్తం ధాన్యంలో 38 శాతం మాత్రమే రైతుల నుంచి కేంద్ర ప్రభుత్వం కొనుగోలు చేసింది. దీనిలోనూ భారీ అసమానతలు ఉన్నాయి. పంజాబ్, హర్యానా రాష్ట్రాలే అధికంగా ఎంఎస్‌పి ప్రయోజనం పొందుతున్నాయి. వరి అత్యధికంగా పండుతున్న పశ్చిమబెంగాల్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో పండిన పంటలో 20 శాతం లోపే సర్కారు సేకరించింది. మొన్న ఖరీఫ్ సీజన్‌లో భారత ఆహార సంస్థ (ఎఫ్‌సిఐ) లెక్కల ప్రకారం డిసెంబర్ 7 నాటికి చూస్తే 75 శాతం ధాన్యం సేకరణ కేవలం పంజాబ్, హర్యానా నుంచే జరిగింది. దీన్నిబట్టి మెజార్టీ రాష్ట్రాల్లో అధిక సంఖ్యలో రైతులు ధాన్యాన్ని ప్రైవేటు వ్యాపారులకు అమ్ముకున్నారని అర్థమవుతుంది. ప్రభుత్వ అగ్రిమార్కెట్ డేటా మేరకు

వరి, సజ్జ, మొక్కజొన్న, మినుము, సోయాబీన్ తదిర పంటలను రైతులు ఎంఎస్పి కంటే తక్కువకు అమ్ముకున్నారు. మొక్కజొన్నకు ప్రభుత్వం క్వింటాలుకు ప్రకటించిన ఎంఎస్పి రూ.2,150 కాగా చాలా రాష్ట్రాల్లో 1,200 నుంచి 1,600కు రైతులు తెగనమ్ముకున్నారు. గుజరాత్, కర్నాటక, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో సజ్జల ఎంఎస్పి 2,150 కాగా 1,300-1,400కు అమ్ముకున్నారు. లాక్డౌన్ వలన రబీలో మార్కెట్కు పంటల రాక బాగా పడిపోయింది. అదే ఒరవడి మార్చి నుంచి సెప్టెంబర్ మధ్య కొనసాగింది. మార్కెటింగ్ గణాంకాల ప్రకారం దేశంలో ప్రధానమైన గోధుమ పంట 2019 కంటే 2020లో కేవలం 60 శాతం మాత్రమే వచ్చింది. బార్లీ, కాలిఫ్లవర్, టమాటా, క్యాబేజి తదితర పంటలు యాభై శాతమే మార్కెట్కు వచ్చాయి. మార్కెట్కు తీసుకెళ్లినా ధరలు రావన్న ఉద్దేశంతోనే రైతులు మార్కెట్ల ముఖం చూడలేదు. ఆ మేరకు ఆదాయాలు నష్టపోయారు.

## అధిక వడ్డీలు

పెరిగిన వ్యవసాయ ఖర్చుల నేపథ్యంలో పెట్టుబడుల కోసం అనివార్యంగా అధిక వడ్డీలపై ఎరువులు, పురుగుమందులు, విత్తనాలు విక్రయదార్లు, వడ్డీ వ్యాపారులు, స్థానిక వ్యాపారులు, స్నేహితుల వద్ద అప్పులు చేసినట్లు సర్వే టీంకు రైతులు వివరించారు. వడ్డీ నెలకు మూడు నుంచి ఆరు శాతం, సాలీన లెక్కిస్తే 36-72 శాతం అవుతుంది. కరోనా సంక్షోభం వలన గతంలో తీసుకున్న బ్యాంక్ రుణాలను తిరిగి చెల్లించలేకపోవడంతో రైతులకు కిసాన్ క్రెడిట్ కార్డులు, ఇతర సంస్థాగత రుణాలు అందలేదు. బీహార్ నయనగర్ గ్రామానికి చెదిన పేద రైతు మాట్లాడుతూ 'నేను ఇన్పుట్ మర్చంట్ దగ్గర 16 వేలు అప్పుతీసుకున్నాను. నెలకు వడ్డీ 4 శాతం. ఏడాదికి 48 శాతం' అని చెప్పాడు. సంస్థాగత రుణాలు అందుబాటులో లేక అప్పులకు డిమాండ్ పెరగడంతో సాధారణ రోజుల్లో మూడు శాతం ఉన్న వడ్డీ 4 శాతానికి పెరిగింది.

## చట్టాలు పూర్తి భిన్నం

సర్వే ప్రధానంగా తేల్చిందేమనగా మొదటిది.. సాగు విస్తీర్ణం, ఉత్పత్తి పెరిగినప్పటికీ కరోనా సంక్షోభ సమయాన రైతుల ఆదాయాలకు భద్రత, గ్యారంటీ లేకుండా పోయింది. ఆ ప్రభావం రైతులెదుర్కొంటున్నారు. రెండవది వ్యవసాయ ఉత్పాదకాలు, డీజిల్ ధరలు, కూలీల ఖర్చులు పెరగడం వలన వ్యవసాయ పెట్టుబడులు పెరిగాయి. చివరిది వ్యవసాయ పెట్టుబడులు పెరిగిన రీతిలో కాకుండా ప్రభుత్వం ఎంఎస్పిని నామమాత్రంగా పెంచింది. ముందటి ఖరీఫ్ కంటే కేంద్రం వరికి ఎంఎస్పి

2.9 శాతం, పత్తికి 4.9 శాతం, పప్పుధాన్యాలకు 2-4 శాతం, నూనెగింజలకు 5 శాతం మేర పెంచింది. ఈ పెంపుదల పెరిగిన వ్యవసాయ ఖర్చులతో పోలిస్తే చాలా చాలా తక్కువ. ఒక వైపు పెట్టుబడుల పెరుగుదల, మరో వైపు నామమాత్రపు ఎంఎస్‌పి, ఇంకో వైపు ప్రభుత్వ ఆధ్వర్యంలో పంటల సేకరణ స్వల్పంగా ఉండటం... వీటి వలన సన్న చిన్న కారు రైతులు ఇబ్బందులు పడుతున్నారు. సాగు, ఉత్పత్తి గతేడాది కంటే పెరిగినా రైతులకు ఏమీ మిగలని పరిస్థితి నెలకొంది. ఈ సమస్యల పరిష్కారానికి ప్రభుత్వ విధానాలు మారాల్సి ఉండగా, అందుకు పూర్తి భిన్నంగా కేంద్రం మూడు వ్యవసాయ చట్టాలు తెచ్చింది. తర్కబద్ధంగా చూస్తే రైతులకు వ్యవసాయ ఉత్పాదకాల ధరలను ప్రభుత్వం నియంత్రించాలి. సంస్థాగత రుణాలకు సదుపాయాలు పెంచాలి. పంటలకు గిట్టుబాటు ధరలను కల్పించాలి. ప్రభుత్వ ఆధ్వర్యంలో పంటల సేకరణ సాగాలి. ప్రభుత్వ జోక్యం పెరిగినప్పుడే అధిక సాగు, ఉత్పత్తి పెరిగినప్పుడు రైతులకు ఆదాయాలొస్తాయి.

**(అనువాదం : కె.ఎస్.వి. ప్రసాద్)**



ఢిల్లీ సరిహద్దుల్లో కర్షకులు సరికొత్త చరిత్రను లిఖిస్తున్నారు. 1990 తరువాత నయా - ఉదారవాద విధానాలకు ఈ స్థాయి ప్రతిఘటన ఇన్ని రోజులపాటు రావడం దేశంలో ఇదే తొలిసారి. వినాశకరమైన మూడు వ్యవసాయ చట్టాలను వెనక్కు తీసుకోవాలనే ప్రధాన డిమాండ్ సాధించాలనే కృతనిశ్చయంతో అన్నదాతలు ఉన్నారు. ఈ చట్టాలపై వ్యతిరేకతకు స్పష్టమైన, సహేతుకమైన కారణాలున్నాయి. వణికించే చలిని ధైర్యంగా ఎదుర్కొంటూ, ప్రభుత్వం నుంచి ఎదురవుతున్న వ్యతిరేకతపై ఎదురు దాడిచేస్తూ, శత్రువులా వ్యవహరిస్తున్న ప్రధాన మీడియాను లెక్క చేయకుండా... లక్షలాది మంది రైతులు ఢిల్లీ సరిహద్దుల్లో చావో బతుకో తేల్చుకునే యుద్ధానికి సన్నద్ధమయ్యారు. రైతు వ్యతిరేక చట్టాలను రద్దు చేయాల్సిందేనని ముక్త కంఠంతో నినదిస్తున్నారు. ఈ పోరాటానికి కారణాలేమిటి? దీన్ని వ్యతిరేకిస్తున్న శక్తుల స్వార్థమేమిటి?



PSBH

ప్రజాశక్తి బుక్‌హౌస్


మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA111B146 |
| పుస్తకం పేరు | వ్యవసాయచట్టాలకు వ్యతిరేకంగా చారిత్రాత్మకరైతాంగపోరాటం |
| తారీఖు | 13 March 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT, H, b, bH, Ba |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | akshaya |
| స్కాన్ చేసినది | Habeeba |
| పరీక్ష చేసినది | TRIVENI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |